# ఈ 8 కారణాలకోసం...

























# భారతపు ప్రథమ ప్రెషర్ కుకర్ నేడు కూడా విపులంగా ఉపయోగింపబడుతున్నది




**ప్రెస్టీజ్**
టి టి. (ప్రైవేట్) లి.
బెంగళూరు-560016

MCA/TT/50-Tel

23827

# జనాదరణపొందిన ఉత్పత్తి...




లాయల్ వారి సమర్పణ

ఎల్లకాలములందూ ప్రియమైనది.

బ్లెండెడ్ సూటింగులు, షర్టింగులు, 2 బై 2 వాయిల్స్, ఉత్కృష్టమైన కేంబ్రిక్స్, యూనిఫారమ్ బట్టలు, లాంగ్‌క్లాత్, మల్, మృదువైన ఉత్తమ నయమైన ప్రత్తి బెడ్‌షీట్లు, తెరలు, మేజలపై పరచు మరియు ఇతర గృహాలంకార బట్టలు, వివిధ మోహక రంగులలో నేయబడినవి మరియు ప్రింటులు.

# లాయల్

లాయల్ టెక్స్‌టైల్ మిల్స్ లిమిటెడ్.
వ్యాపార కార్యాలయము:
పోస్టుబాక్స్ నం. 3750
మౌంట్ రోడు మదరాసు-600 002.
లాయల్ - ప్రియకరమైన బట్ట.







Criterion LTM 3464

గ్యారంటీర్స్ : మెస్సర్స్ : **సీతారామ్ ఎంటర్ ప్రైజెస్,** 158, ఒప్పనకారి వీధి, కోయంబత్తూరు–641001.
మెస్సర్స్ : కేరళ టెక్స్‌టైల్ ఏజన్సీస్, పి.బి. నెం. 2, పట్టాంబి-679303.

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 6–1–'78

పింగళనామ సం. మార్గశిర బ. ద్వాదశి

సంపుటము 71 : సంచిక 16

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60

ఆరు మాసాల చందా రు. 20-80

విడిప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# మనలో మాట

మా పాఠకులకు, రచయితలకు, ప్రకటన కర్తలకు, ఏజెంట్లకు అందరికీ మా నూతన ఆంగ్ల సంవత్సరాది పండుగ శుభాకాంక్షలు !



రాగమాలిక సీరియల్ రచన చేసిన శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్ గారు భర్త ఉద్యోగరీత్యా చిత్తూరు జిల్లా ఋషీవ్యాలీలో వుంటున్నారు. పుట్టింది హైదరాబాద్‌లో నైనా విద్యాభ్యాసం అంతా గుంటూరులో జరిగింది. బి. ఏ. పట్టభద్రురాలు. వివాహం 1969లో అయింది – ఇరువురు సంతానం – అమ్మాయి పేరు పద్మప్రియ, అబ్బాయి పేరు శ్రీనాథ్. వీరు కథలు, వ్యాసాలు విరివిగా రాశారు. తొలినవల 'మోహనరాగం' మంచి ప్రాచుర్యాన్ని పొందింది. 'రాగమాలిక' శ్రీమతి పుణ్యశీల గారి రెండవ సీరియల్ రచన – ఇది మా పాఠకులకు నచ్చుతుందని అనుకొంటున్నాము.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

14-14-21, హరిశ్చంద్రరావు వీధి,

గాంధీనగర్, విజయవాడ-520003

### బైస్కోపు బాతాఖానీ

23–12–77 సంచికలో బైస్కోపు బాతాఖానీ శీర్షికలో శ్రీ వీరాజీ వ్రాసిన విషయాలు ఆలోచనా ప్రేరకంగాను, ఉత్తేజకరంగాను ఉన్నాయి. నేటి తెలుగు సినిమాల్లో వెర్రితలలు వేస్తున్న అవాంఛనీయ ధోరణులను నిర్భయంగా నిర్మొగమాటంగా విమర్శించారు. సభ్యతను, ఉత్తమత్వాన్ని అభిమానించే ప్రేక్షకుల అభిప్రాయాలను ఆ వ్యాసం ప్రతిబింబిస్తోంది. ఇంకో మెట్టు ముందుకు వెళ్ళి ఫలానా చిత్రాలలో ఇలాంటి అసభ్య సన్నివేశాలున్నాయని వేలుపెట్టి చూపెడితే ఇంకా బాగుండేది.

నిర్మాతలు, దర్శకులు. పాటల రచయితలు, ప్రేక్షకులు సెన్సారు వారు అందరూ ఈ నీచ స్థితికి బాధ్యులే.

ఆత్రేయగారితో [దసరాబుల్లోడు నుంచి ఎదురులేనిమనిషి వరకు] ఇలాంటి పాటల రచన ప్రారంభమయింది. ఇప్పుడు ఇలాంటివి ఎక్కువగా వేటూరి వ్రాస్తున్నారు. భవిష్యత్తులో మరొకరు వ్రాయవచ్చు. అదికాదు ప్రశ్న. ఇలాంటి పాటలు రావడానికి కారకులెవ్వరు? ఒకప్పుడు సముద్రాల, పింగళి మొదలైన వారు శృంగార గీతాలనే ఎంతో చక్కగా వ్రాశారు. ఇప్పుడుకూడ దేవులపల్లి, శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి వంటి కవులు చక్కని గీతాలను రచిస్తూనే ఉన్నారు. ఆత్రేయ, వేటూరి కూడా మూగమనసులు, సిరిసిరిమువ్వ చిత్రాలలో మంచిపాటలను వ్రాసినవారే! మరి అసభ్యమైన పాటలను వీరిచేత రాయిస్తున్నవారు దర్శక నిర్మాతలా? లేక ప్రేక్షకులా?

డ్యూయెట్ సాంగ్స్‌ను నేటి యువతీ యువకులే అసహ్యించుకుంటున్నారంటే, పరిశ్రమలోని వారు విషయం అర్థం చేసుకోవాలి. ఇక సెన్సారు వారు తమ కేమీ పట్టనట్లు కళ్ళు మూసుకుని కూర్చున్నారు. వారి అండను మాకు తెలియచేస్తే, ఫిలిం సొసైటీలు, ఇతర సాంస్కృతిక సంస్థల ద్వారా వారికి హెచ్చరికలు, వినతిపత్రాలు పంపవలసి వుంటుంది. స్వర్గీయ బి. యన్. రెడ్డి, రామబ్రహ్మం, కె. వి. రెడ్డి వంటి ప్రముఖులు తెలుగు సినిమా చరిత్రలో సువర్ణాధ్యాయం సృష్టించారు. గతాన్ని మర్చిపోతే పోయాం, కన్నడ, మళయాళ, బెంగాలీ రంగములలో నవలెఆదర్శ చిత్రాలను తీయకపోయినా, హిందీ, తమిళ సినిమాలను కూడా అసభ్యత తో మన తెలుగు సినిమాలు బీట్ అవుట చేస్తున్నాయి.

(50 వ పేజీ చూడండి)

# బ్రూ-కమ్మని రుచికి, సువాసనకి మొదటి రకము

## దాని వెల ఎంతో ఆకర్షణీయమైనది

**మంచి కాఫీ అభిమాను లందరికి :**

బ్రూ ప్రత్యేక రుచి దేశ మంతటా కాఫీ అభిమానుల మెప్పును పొందింది. అందువలన ఇన్‌స్టెంట్ కాఫీలో మేటిగా ఉన్నది. బ్రూ రుచి మీద అభిమానం రోజు రోజుకూ పెరుగుతోంది. మంచి చిక్కని కాఫీ బ్రూ ఎప్పుడూ అసమాన తృప్తినిస్తుంది. మెచ్చిన రుచి, చిక్కదనం ఈ రోజే వాడి చూడండి.




OBM-5223A/1 TEL













## చిన్న సీరియల్

# పి. ఎ. హిమబిందు

జొన్నలగడ్డ లలితాదేవి

*(గత సంచిక తరువాయి)*

శ్రీపతి క్వార్టర్సులోకి హిమ తన సామానులన్నీ తెచ్చుకుని సర్దుకోడానికి రెండు రోజులు సెలవు పెట్టింది. ఆమె అభిమతానుసారం ఇల్లంతా సరుకునేసరికి రెండు రోజులూ పూర్తిగా పట్టింది.

ఆ యింటిని ఆమె అలంకరించిన తీరు చూసి శ్రీపతి నిజంగానే పిచ్చివాడయ్యాడు. ఈమెకి సౌందర్యం పట్ల ఎంత అభిరుచి? ఎంత ఆసక్తి! అది చూసి నిజంగా ఇంతటి రసపిపాసి తన భార్య కావటం తన అదృష్టమే అని మురిసిపోయాడు శ్రీపతి.

ఆమె ఇంటినే గాదు. చుట్టూ వున్న ఖాళీస్థలాన్ని, అక్కడక్కడ అడ్డదిడ్డంగా పెరిగిన మొక్కల్ని కూడా ఎంతో నేర్పుగా తీర్చిదిద్దింది. మొక్క మొక్కకీ ఎంత దూరం వుంటే బాగుంటుందో ఏ మొక్క ఎటుప్రక్క వేస్తే అందంగా వుంటుందో ఆకర్షణీయంగా కనిపిస్తుందో, గేటు దగ్గర నుంచి టేపుతో లెక్కలుతీసి మరీనాటించింది. అలాగే రకరకాల రంగు రంగుల పుష్పమాలికలు ఏ రంగు పక్కన ఏ రంగుతో వుంటే కొట్టవచ్చినట్టు కనిపిస్తుందో ఆ కలయిక వచ్చేటట్టు శ్రద్ధ తీసుకుంది. ఇవన్నీ చూసిన శ్రీపతి తానిక నందన వనంలోనే విహరించవచ్చని ఆనందించాడు.

సతీమణి అలసిపోకుండా వంట మనిషిని కుదిర్చాడు. బటన్ నొక్కితే చేతులు కట్టుకుని వంగి నిలబడే పనివాళ్ళనీ పెట్టాడు. కాలు కింద పెడితే కందిపోతుందేమోనని తివాచీలు పరిపించాడు.

ఎంతో అపురూపంగా, పరెంతో ముద్దుగా ఆమెని తన ప్రాణంకన్నా మిన్నగా చూసుకోసాగాడు.

ఇవన్నీ హిమబిందును ఆనందమాలికా డోలికలలో వూగులాడించాయి, మేఘాలలో తేలియాడించాయి. ఇంత గొప్ప భర్తనిచ్చిన భగవంతుడికి మనసులోనే అంజలి ఘటించిందామె!

శ్రీపతి, హిమబిందుల వివాహం అయి రెండు మూడు నెలలు గడిచిపోయాయి. ఏ పనీ చేయనగత్యం లేకుండా హిమబిందుకు అలంకరించుకోవడ మొక్కటే పని కనుక ఆమె కొనే చీరలకి, అవి అలంకరించుకునే తీరుకు శ్రీపతి లోలోనే అశ్చర్యపోయేవాడు కొత్త ఫ్యాషన్ అంటూ ఏది కనిపించినా అది హిమ ఇంట్లో చోటు చేసుకోవలసిందే.

ఆ రోజు హిమ మోడల్ మార్చి కొత్త తరహా నెక్లెసు చేయించాలని బంగారు కొట్టుకి వెళ్ళింది మధ్యాహ్నం శెలవుపెట్టి —ఎక్కువపని వుండటంతో ఓవర్ టైం చేయాల్సి వచ్చింది మాధవికి.

భార్య ఆఫీసుకు వస్తుందేమోనని ఎదురు చూస్తూ శ్రీపతి గది బయట పార్టీకోసం వేసిన సోఫా మీద ఆసీనుడయ్యాడు. చేతి రుమాలుతో ముఖం తుడుచుకుంటూ యువతలకి వచ్చింది మాధవి. ఒంటరిగా శ్రీపతిని చూసేసరికి ఆమె హృదయం అప్రయత్నంగానే ఆనందంతో గంతులు వేసింది. అతనూ చూసాడామెవంక. అది గమనించి విష్ చేసింది మాధవి.




"ఏం మాధవీ ; ఇంకా వెళ్ళలేదా ?" అనడిగాడు చిరునవ్వుతూ.

"లేదు. కొంచెం వర్క్ ఎక్కువగా వుందని ఓవర్ టైం చేసాను."

"చీకటి పడిపోయింది. రిక్షా మీద వెళ్ళు" అంటూ జేబులోంచి రూపాయి తీయబోయాడు.

"ఫర్వాలేదులెండి. గట్టిగా నడిస్తే పదినిముషాలు కూడా పట్టదు" అంది తీసుకోకుండా.

"ఎక్కడ మీ యిల్లు ?"

చెప్పిందామె. అది తన క్వార్టర్సుకు వెళ్ళే మధ్యదారే, "అయితే ఓ పదినిముషాలాగు హిమ వచ్చేస్తుంది. కారులో వెడదాం. మధ్యదారేగా" అన్నాడు సహృదయంగానే.

"ఎక్కడికి వెళ్ళారామె ?" కుతూహలంగా అడిగింది.

"ఏవో నగలు చేయిస్తుందట." అంటూ నవ్వాడు శ్రీపతి.

"అదృష్టవంతురాలు" అంటూ సన్నగా నవ్వింది మాధవి.

ఇంతలో హిమ వచ్చేసింది. శ్రీపతి రూంలోకి వెళ్ళి తల దువ్వుకుని, లైట్‌గా పౌడరు అద్దుకుని బయటికి వచ్చాడు. అది హిమబిందు ఆజ్ఞ. తల చెరగరాదు. ఫేస్ పౌడర్ అద్దుకుని "ట్రిమ్"గా వుండాల్సిందే తప్ప జిడ్డు ముఖంతో కనిపించ కూడదు. డ్రస్ కూడా నలగకూడదు. ఎంతటి డ్రస్ అయినా రెండు రోజులకంటే మూడో రోజు ధరించరాదు. కర్చిఫ్‌లు ఏరోజు కారోజు మార్చేయాలి. బూట్లు రోజూ పాలిష్ చేయించాలి. గడ్డం రోజూ చేసుకోవాలి. ఇవన్నీ శ్రీపతికి పెళ్ళయిన మర్నాటినించి హిమబిందు పెట్టిన ఆంక్షలు. ఇందులో పొరపాటున ఏది మర్చిపోయినా హిమబిందు రుసరుసలాడుతుంది. ఇవన్నీ మర్చిపోకుండా ఆలోచిస్తున్నంతకాలమూ ఆమె కళ్ళల్లో వెలిగే ఆనంద రేఖలు ఎవరూ వర్ణించలేరనవచ్చు.

హిమబిందు కూడా కాస్త టాయిలెట్ అయింది, "రా మాధవి !" అంటూ శ్రీపతి కారు వెనుక తలుపు తెరిచాడు. హిమకది అంత నచ్చకపోయినా మౌలికంగా వూరుకుంది. మాధవి నలిగిన చీర, జిడ్డుగా వున్న

ముఖం, రేగినజుట్టు హిమబిందుకు బొత్తిగా వచ్చలేదు. ఆలాంటి ఆమెని కారులో కూర్చోబెట్టుకోవడం ఆమెకి సుతరామూ యిష్టంలేదు. ఆమె ఆలోచన ముగియగానే మెయిన్ రోడ్డు ప్రక్కగా శ్రీపతి కారు ఆపడమూ, మాధవి దిగి థాంక్స్ చెప్పి వెళ్లిపోవడం కూడా జరిగిపోయాయి. అప్పుడు తృప్తిగా నిట్టూర్చింది హిమ.

"మరీ ఆఫీసులో పని అంతా తన భుజస్కంధాలమీదే వున్నట్టు ఎప్పుడూ ముఖం

వేలాడే వుంటుంది మాధవి'' చిరాగ్గా అంది హిమ.

''అందరికీ నీ అంత శ్రద్ధ వుండద్దూ అందం మీద.''

''అందుకే మరి ఇల్లు, ఆఫీసు, తిండి, నిద్ర, ఇవి తప్ప మరోదానిపై శ్రద్ధలేని అలాంటి సగటు మనుష్యుల్ని చూస్తుంటే నాకు తగని బోరు'' విసుగ్గా జవాబిచ్చింది.

''వారి జీవితాలవి : అంతా మనలాంటి వారైతే ఆర్డినరీ పీపుల్స్ ఏమవుతారు?''

''ఏమయితే ఎవడిక్కావాలి' బొత్తిగా దాలిగుంటల్లో కుక్కల్లా పొర్లుతూ బ్రతక్కపోతే ఏం ?''

''అనాకారులకి, అభాగ్యులకి, నిరుపేదలకీ అందరికీ ఈ విశాల విశ్వంలో జీవించే హక్కు వుంది హిమా ! అందమైనవారు ధనవంతులూ మాత్రమే బ్రతికి మిగిలినవారంతా గంగంలో కలవాలనే నీ అభిప్రాయం మార్చుకో ! అందం ఎప్పుడూ శాశ్వతం కాదు అలాగే ధనమూ శాశ్వతంకాదు ఏదో పూర్వజన్మ సుకృతంకొద్దీ ఈ జన్మలో అనుభవిస్తున్న రెండు వరాలు అవి. భగవంతుడిచ్చిన ఆ వరాలకు వినయాంజలితో మసులుకుంటే మనపట్ల భగవంతుడు ఆదరదృష్టి కనబరుస్తాడు. ఆయనిచ్చిన ఆ సంపదకి అదరిపడితే ఏదో ఒకరోజు పాతాళానికి నొక్కిపెడతాడు.'' శ్రీపతి పలుకులు అసలు రుచించలేదు హిమకి.

''మీరు ఎన్నయినా చెప్పండి. నాకలాంటి మట్టి మనుషులంటే బొత్తిగా గిట్టదు.'' పెంకెగా అంది హిమ. శ్రీపతి ఇంక వాదించడం దేనికని మౌనం వహించాను.

## 4

రాను రాను హిమబిందు అభిప్రాయాలు మరీ దారుణంగా మారిపోతున్నాయి అనుకున్నాడా రోజు. ''పెళ్ళయి మనం ఆర్నెల్లనించీ కాపురం చేస్తున్నాము. నీనించి ఇంకా శుభవార్త రాలేదే !'' అన్నాడు శ్రీపతి ఆ రాత్రి భార్యని గుండెల్లో పొదువుకుంటూ.

''ఏం శుభవార్త ?'' ఆశ్చర్యంగా అడిగింది హిమ.

''అదే ! మనకి పాపో, బాబో పుడతాడన్న శుభవార్త ...'' ఆ మాట వింటూనే ఛట్‌మంటూ లేచింది హిమ.

''పెళ్లికి వెలగాటం, ఎలిక్కి ప్రాణసంకటం అంటే యిదే ! తొమ్మిది నెలలు మోసి, నానా బాధాపడి. చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడి, అందాన్ని, యవ్వనాన్ని తగలేసుకుని నేను బిడ్డని కనడం మీకు సంబరం ?! పుడతారని చెప్పడం శుభవార్తా ?! ఛీ ! ఏం మనుష్యులు ?! అవును. ఏ బాధలు పడినా మేమేగా! మీరు హాయిగా బాగానే వుంటారు. కష్టం, బాధ ఎరగరు గనుక, స్వార్థపరత్వంతో ఎన్నయినా కోరికలు కోర్తారు. ఏదోవిధంగా మీ పురుషత్వాన్ని ప్రదర్శించబోతారు !'' తీక్షణంగా అంటున్న హిమని చూసి అవాక్కయ్యాడు శ్రీపతి.

> **జరిగినకథ 2** జనరల్ మేనేజర్ శ్రీపతి పి. ఏ. గా చేరిన హిమబిందు అందం ఆ ఆఫీసులో అలజడి రేపుతుంది. డబ్బు, హోదా, అధికారం అన్నీవున్న శ్రీపతి ఆమెని ఆకర్షిస్తాడు. హిమబిందు శ్రీపతి పెళ్లి చేసుకుంటారు.

''దాంపత్యము, సంతానమూ అనేది సృష్టి ధర్మం. దానికి నీ కింత కోపం ఎందుకు రావాలో నాకు అర్థం కాలేదు'' తేరుకుని మెల్లగా అడిగాడు శ్రీపతి.

''అర్థం కాదు. ఎలా అవుతుంది! వుండేది ఈ శతాబ్దంలోనూ, భావాలు మాత్రం బి.సి. నాటివీను. మీ దాంపత్యాల ధర్మాలు, ధర్మశాస్త్రాలు నా దగ్గర వల్లించమోకండి. నాకు ''ప్రెగ్నెన్సీ'' రావడమే ఇష్టంలేదు. పిల్లల్ని కనడం అసలిష్టం లేదు. అందుకే నేను జాగ్రత్తగా వుంటున్నాను.'' హిమబిందు మాటలకి మళ్లీ నోరెత్తలేక పోయాడు శ్రీపతి. ఆ రాత్రి హిమ శ్రీపతిని విదిలించుకుని వేరే మంచం మీద పడుకుంది.

''నీ పేరే హిమబిందు. హిమబిందు అంటే నీ కోపం కూడా హిమంలానే నిముషంలో కరిగిపోవాలిగాని ఇలా గంటలతరబడి సాగిస్తారేమిటి? ఏదో నోరుజారి అన్నానులే. రా! వచ్చి పడుకో!'' అంటూ తన ప్రక్కమీదికి రమ్మని బ్రతిమాలసాగాడు.

అతనలా అంటున్నకొద్దీ మరింత బిగుసుకుపోయింది హిమ. మగవాడు బతిమాలనే బతిమాలడు. ఆ స్థాయికి వచ్చినప్పుడు ఇంకాస్త బెట్టు చూపిస్తే మళ్ళీ అలాంటి టాపిక్ ఈ జన్మలో తేకుండా వుంటాడు'' అని భావించిన హిమ విననట్లే వూరుకుంది ఆరాత్రి నాతిగల బ్రహ్మచర్యం వెలిగించి తెల్లవారగానే గదిలోంచి బయటకి వెళ్ళిపోయాడు శ్రీపతి. అతనికి ఎందుకో హిమ ధోరణి సంతుష్టి కలిగించలేక పోయింది. తన అభిప్రాయాలకి ఆమె అభిప్రాయాలు భిన్నమైన వవడంచేత హిమబిందు తన మాటల్ని గుడ్డి గువ్వల్లా తీసిపారేస్తుంది. ఏమన్నా లెక్కలేక చివరికి పెడసరంగానే మసులుతుంది'' అని భారంగా నిట్టూర్చాడు శ్రీపతి

కోపగ్రస్తయైన హిమబిందు ఆ రోజు భర్తతో కలిసి కారులో ఎక్కి అఫీసుకి రావడానికి ఇష్టపడక రిక్షామీద అతనికంటే ముందే అఫీసుకు వెళ్లిపోయింది. శ్రీపతి ఒక్కడే వుసూరుమంటూ కారులో ఆఫీసుకు బయలుదేరాడు.

దారిపొడుగునా అతని మస్తిష్కం ఆలోచనలతోనే కొట్టుమిట్టాడుతోంది. చింతాక్రాంతమైన మనసుతో కారు నడుపుతున్నాడు. రోడ్డు టర్నింగ్‌లో అయిదారేళ్ల



# పి. ఎ. హిమబిందు

బాబు పుస్తకాలు తీసుకుని ఆలస్యమయిందని కాబోలు ఆదరాబాదరా వస్తూ కారుకు బాగా దగ్గరగా వచ్చేయడంతో సడన్ బ్రేక్ వేయబోయిన శ్రీపతి కారు ఎదుట్నించి క్రాస్ చేస్తున్న లారీకి ఢీకొంది. మరు నిముషంలో శ్రీపతి రక్తసిక్తమైన దేహంతో స్పృహ కోల్పోయాడు అక్కడికక్కడే.

పదిన్నరయినా శ్రీపతి ఆఫీసుకు రాకపోవడంతో రూంలో కూర్చున్న హిమబిందుకు ఆశ్చర్యం కలిగింది. ఇంక ఈ రోజుకు యింటినించి బయలుదేరడేమో అనుకుంటూ వుండగా టెలిఫోన్ గణగణా మ్రోగింది.

గవర్నమెంట్ ఆస్పత్రినించి అందుకున్న ఆ ఫోన్‌కాల్ వింటూనే కొయ్యబారిపోయింది హిమ. వెంటనే ఫ్యాన్ ద్వారా ఆఫీసులో అందరికీ తెలియజేసి రిక్షామీద ఆస్పత్రికి బయలుదేరింది.

శ్రీపతికి యాక్సిడెంట్! అన్న వార్త వినగానే నిలువునా కూలినట్లయింది మాధవి. ఆమె కళ్ళంబడి గిర్రున నీళ్ళు తిరిగాయి. ఆఫీసు క్లోజ్ చేసి అంతా ఆస్పత్రి చేరుకున్నారు. అక్కడ విషాద భరితమైన వదనంతో తల వాల్చుకుని కూలబడి వున్నది హిమబిందు.

మరో పది నిముషాలకు డాక్టర్లు ఇవతలకి వచ్చి "చూడండి! మీకీ వార్త చెప్పాలన్నా నోరు రావడంలేదు. శ్రీపతిగారికి ప్రాణభయం ఏమీ లేదుగాని రెండు కాళ్ళూ తీసివేయాలి." ఇంకా డాక్టర్ల మాట పూర్తి కాకుండానే పిడుగు పడినట్లదిరి పోయింది హిమ.

తన భర్త కుంటివాడు! రెండుకాళ్ళూ లేని నిర్భాగ్యుడు. ఆ మాట వినే భరించలేకపోతోంది, ఇంక చూసి సహించగలదా?

అయితే ఆమె సహనాలతోటీ అసహనాలతోటి డాక్టర్లకి నిమిత్తంలేదు. వాళ్ళకి కావల్సింది ప్రాణంతో జీవించడం. వాళ్ళ పని వాళ్ళు చేశారు.

* * *

రెండు కాళ్ళూ పోయిన శ్రీపతి. మాసిన గడ్డం, నలిగిన బట్టలు, వాడిపోయిన ముఖంతో ఇంచుమించు నెల రోజులకి యింట్లో ప్రవేశించాడు. ఆ రూపం అతని వాలకం చూసేసరికి హిమబిందుకు వాంతి వచ్చినట్లయింది.

తనని చూసి ఆవేదన పొరిలిపోతూండగా హిమబిందు గుండెలు బాదుకుంటూ రోదిస్తుందేమో ననుకున్నాడు శ్రీపతి. అలా ఆమె ఏడుస్తుంటే ఎలా ఓదార్చాలో అన్న సంధిగ్ధస్థితిలో వచ్చిన శ్రీపతి అతి ముభావంగా వున్న హిమబిందును చూసి ఎంతైనా ఆశ్చర్యపోయాడు. అంతకు మునుపు తనని చూసి ఆమె తీగలా పెనవేసుకుపోయి ఎంత ఏడుస్తుందో అన్న భయంతో బితుకు బితుకుమంటున్న అతని హృదయం అలా జరగనందుకు ఒక విధంగా అసంతుష్టి పడింది. తీవ్రమైన ఆపదలో పడి ప్రాణగండం తప్పించుకుని జీవితంలో అనుకోకుండా సంప్రాప్తించిన అవిటితనానికి "తన" అనే వారు నిలువెల్లా వేదన చెందితే ఆ బాధలో ఒకవిధమైన స్వాంతన కలుగుతుంది. మన బాధలో పాలు పంచుకుంటూ మనకోసం పరితపించే ఒక ప్రాణి వుందన్న తృప్తి కలుగుతుంది. ఎవరి ప్రేమాదరణలైనా యిటువంటి విపత్కర స్థితిలోనే బయల్పడేది.

"రంగయ్యా! బాబుగార్ని తీసికెళ్ళి స్నానం చేయించు." హిమబిందు ఆజ్ఞని పాటించడానికి ముందుకు వచ్చాడు రంగయ్య.

"రంగయ్యా; ఆ వీధివైపు గెస్టు రూం బాగుచేసి అయ్యగారికి మంచం పరుపు దులిపివెయ్యి" హిమబిందు ఆజ్ఞలన్నీ రంగయ్య శిరసావహిస్తూ చకచకా చేసేస్తుంటే నిశ్శబ్దంగా తిలకించసాగాడు శ్రీపతి.

భోజనంకూడా అతని గదిలోనే పెట్టి వెళ్ళిపోయాడు రంగయ్య. ఆ అన్నం నిజంగా తిన బుద్ధికాలేదు శ్రీపతికి. కాని అన్ని తాపత్రయాలూ ఈ జానెడు పొట్టకోసమే. అది పెట్టే అలజడికోసమే కనుక తిని లేచాడు.

కాళ్ళులేని జనరల్ మేనేజర్ ఆ పదవికి అయోగ్యుడు కనుక అతనికి రావల్సినవన్నీ ఇచ్చివేసి ఓ వీల్ చైర్ కొనియిచ్చి అతన్ని ఉద్యోగంలోంచి తొలగించేశారు. ఇంత వరకూ వర్తతో, కాదు జనరల్ మేనేజరు గారితో పి. ఏ గా కారులో తిరిగి వాహన యోగం వెలిగించిన హిమబిందుకు, ఇప్పుడు

కారు కరువై కాలినడకో, లేక రిక్షానో శరణ్యమైంది.

అన్నిటికంటే ఆమెకి దుఃఖహేతువైంది. ఆ క్వార్టర్సు ఖాళీచేసి మరోచోట యిల్లు తీసుకోవల్సి రావడం ఇష్టంవచ్చిన విధంగా యింటిని, దొడ్డిని అలంకరించుకుని ఖరీదైన ఫర్నిచరుతో డాంబికమైన జీవితం వెలిగిస్తున్న దానికి అలవాటు పడిన ఆమెకి ఇప్పుడు మళ్ళీ అద్దె యింట్లో మరో రెండు మూడు వాటాల మధ్య వుండవలసి రావడం అనేది దుర్భరమైంది. ఆ సామాన్లన్నింటికీ ఇల్లు కావాలంటే పెద్దదే తీసుకోవాల్సి వచ్చింది. పెద్ద యింటికి పెద్ద అద్దెలు చెల్లించాల్సి రావడం, అదీ ఆమే భరించాల్సిన స్థితిలో పడటం మరింత మండిస్తోంది. వెనకటిలా సంపాదించే మొగుడు కాదుగా యిప్పుడు! ఇవన్నీ ఒక ఎత్తు. ఆఫీసులో పని చేసుకుని వచ్చేసరికి వీల్‌ఛైర్‌తో శ్రీపతి రెడీ. చీ ఇంతకంటె నరకం మరొకటిలేదనుకుంది జుగుప్సగా అతన్ని చూసీ చూడనట్టు వెళ్ళిపోయి లోపల గదిలో ఫ్లాస్కులోంచి కాఫీ పోసుకుని తాగి సేద దీరి ఏ పుస్తకమో చేతబట్టు కునేది, వెనకటిలా నౌకర్లు చాకర్లు లేరు గనుక చచ్చినట్టు పనిచేసుకోవాల్సి వస్తోంది అక్కడికీ చాలా పని పని మనిషే చేస్తుంది. కాఫీలవీ కలుపుతుంది. టిఫిన్లు చేసి పెడుతుంది. అయినా హిమబిందులో నానాటికీ అసహనమే హెచ్చిపోతోంది.

భార్య వైఖరిని అర్థం చేసుకున్న శ్రీపతి తనే దూరంగా వుండసాగాడు. ఆమె అన్నం కంచంలో పెట్టి పని మనిషికే ఇచ్చిపంపుతుంది. మళ్ళీ మారు అడగకుండా చాలినా, చాలకపోయినా అదే సరిపెట్టుకుంటాడు. ఆమె తనని గాదు ప్రేమించింది. తన హోదాని, తన అందమైన రూపాన్ని, తన ఆర్జనని, ఇప్పుడా మూడూ కరవయ్యేసరికి హిమబిందు బుద్ధి కూడా మారిపోయింది. అందంపట్ల ఆరాధన, ధనంపట్ల మక్కువ ఎవరికైనా వుండవచ్చు గాని మరీ ఇంత దారుణంగా వాటిన్నే ప్రాణంగా భావించడమా అలా భావిస్తూ మనిషిని గొంగళి పురుగులా దులిపి వేయడమా:'' అని తీవ్రముగా బాధ పడ్డాడు శ్రీపతి.

(ఇంకా వుంది)

## రచయితలకు మనవి

కార్టూన్‌లతోను కథలతోను స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరులు జతపరచకపోతే వాటిని త్రిప్పిపంపటం సాధ్యంకాదు. సం.

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!

రుచికరమైన, పుష్టికరమైన
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు







బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GLX.36-203 TL

# ధర్మపథం

—బులుసు వేంకటరమణయ్య.

## దంభభక్తి

శ్రీకృష్ణుని గాథను ప్రదర్శిస్తున్న .వీధి భాగవతాన్ని మీరు ఎప్పుడయినా చూచి ఉన్నారా? ఉన్నట్లయితే యీ విషయం మీకు గుర్తుకు రావచ్చును. రంగస్థలం మీద పాటగాళ్ళూ, హంగు దారులూ మద్దెల తాళాలు ప్రయోగించేవారూ అందరూ ఎంతో ఆర్భాటం చేస్తూ, పాటలు పాడుతూ శ్రీకృష్ణుణ్ణి రంగస్థలం పైకి రావాలని ఆహ్వానిస్తారు. అయినా, కృష్ణ వేషగాడు ఉలకడు, పలకడు. వేషాలు వేసుకునే గదిలో కూర్చుండి తన సహచరులతో ఏవో కబుర్లు చెప్పతూ కూచుంటాడు. రంగస్థలం మీది వారి గోలను చెవిని పట్టించుకోడు. కొంత సేపటికి ఆ హంగామా అంతా అణగిపోతుంది తర్వాత నారద వేషగాడు రంగస్థలం పైకి వచ్చి హృదయ పూర్వకమైన భక్తిని ప్రకటిస్తూ మధురమైన గానంతో "కృష్ణా! కృష్ణా! నీ దర్శన భాగ్యాన్ని కలుగజేయి" అని ఆహ్వానించగా, ఆ కృష్ణ వేషగాడు రంగస్థలం పయి ప్రత్యక్షమవుతాడు. ఇది తెలుగు ప్రాంతాలలో కొన్ని చోట్ల, వంగదేశంలోనూ కానవచ్చే దృశ్యం!

ఈ ప్రదర్శన ఒక ఉత్తమ విషయాన్ని వ్యక్తం చేస్తూ ఉన్నది. కాకి గోలవంటి ఆర్భాటం కన్న కమనీయమైన గానమే భగవంతుణ్ణి ఆకర్షిస్తుందని మనం ఊహించవచ్చును. "గోవిందా! గోవిందా!" అని గట్టిగా అరుస్తూ ప్రతి యింటికీ యాచనకోసం వెళ్ళేవారందరూ నిజమైన భక్తులు కారనీ, సరియైన భక్తులు ప్రశాంతంగానే భగవంతుణ్ణి ధ్యానిస్తారనీ దీనివల్ల గ్రహించవచ్చును.

గట్టిగా నినాదం చేసే దైవ ప్రార్థనలు పెదవినుంచే వస్తాయికాని హృదయం నుంచి రావు. తాము భక్తులమని నలుగురికీ ప్రకటించడానికి మాత్రమే అవి ఉపయోగపడతాయి.

మహా మును లందరూ భగవంతుణ్ణి మనస్సులోనే ధ్యానంచేసేవారు. కాని పైకి గట్టిగా భగవన్నామమును ఉచ్చరించ లేదు. మంత్రాలు మున్నగునవి మనస్సులోనే మననం చేసినప్పుడే పనిచేస్తాయి గట్టిగా పైకి ఉచ్చరిస్తూ మననం చెయ్యకూడదు.

భక్తి అనేది హృదయం లో నుండి పుట్టుకు రావలసిందేగాని, అందరూ దేవుని నామమును ఉచ్చరిస్తూ ఉన్నారు గదా! అని తాము కూడా గట్టిగా ఉచ్చరించినంత మాత్రాన అది కలుగబోదు.

హృదయ పూర్వకంగా భగవంతుణ్ణి సేవించడంలోనే భక్తి ఇమిడి ఉన్నది.



డాక్టరుగారూ! నా బొమ్మ పాపకు
కులాసాగా లేదండీ.
కాస్త పరీక్ష చేయండి.



జ్వరం లేదు. కానీ,
కడుపునొప్పితో అవస్థ పడుతోంది.
పాపకు ఎప్పుడైనా
ఉపశమనంగా లేనప్పుడు
వుడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్
ఉపశమనాన్ని చేకూర్చగలదు.
మా అమ్మకూడా నాకు
దీనినే యిచ్చేది.






# వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్

100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన
తల్లులకు విశ్వాసపాత్రమైనది.

వుడ్‌వర్డ్స్ కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు
పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.

CAS OPPL-1-TE 77

## ఆకలి మీద అమ్మకం పన్ను

ఇప్పటి ప్రజలు పోయిన ప్రజలకన్నా అదృష్టవంతులు. ఈనాటి వారు చివరికి హోటల్లో కాఫీ తాగినా అమ్మకపు పన్ను కట్టేస్తున్నారు. ఇడ్లీ తిన్నా, దోసె తిన్నా మరేదైనా ఇంకేదైనా తిన్నా, తాగినా అమ్మకం పన్ను మనకవి అమ్మినవారు ప్రభుత్వానికి కట్టడానికి ఆమేర మనవద్ద గుంజేస్తున్నారు. ఈ గుంజడంలో వారు ప్రభుత్వానికిచ్చే దానికన్నా పిసరంత ఎక్కువే లాగుతున్నారు. ఇదిలా వుండగా మధ్యప్రదేశ్‌లోని వర్తకులు కాఫీవెల, లేక ఏదైనా పదార్థం వెల, వాటిమీద టాక్సును కలిపి, ఆ మొత్తం మీద కూడా సామాన్య మానవుడి వద్ద టాక్స్ ఒడిసిలాగేస్తున్నారట. అనగా మూడు రూపాయల సరుకు కొంటే, దానిమీద ఎనిమిది రూపాయల టాక్సు కలిపి, మూడెనిమిది రూపాయల మీదా కలిపి టాక్సు గుంజాయిస్తున్నారట. సామాన్య మానుడా నీ శక్తి చాలా గొప్పదయ్యా!

## భర్తకు విషం!

సౌడవాల్‌పేటకు చెందిన సొత్తంపట్టి అనే గ్రామంలో చలమ్మ అనే ఆమె, సోమవారపుపేటకు చెందిన కనకరాజు అనే అతను, ఒకరినొకరు చాలాకాలం ప్రేమించుకుని, ఊహాలోకాల మంచె పిసరంత క్రిందికి దిగి, వివాహం చేసుకున్నారట. కానీ చలమ్మకి వివాహానికి ముందున్న ఊహాలోకం ముందు ఆనకవచ్చిన నిజలోకం బొత్తిగా నచ్చక పెళ్ళయిన వారానికే జీవితం చిరాకేసి ఒకనాటి ప్రియుడైన యీనాటి భర్తతో డిబ్బా అని పోట్లాడి తన తల్లింటికి పోతూవుండేదట. కనకరాజు అత్తారింటికి వెళ్ళి ఆమెకు నచ్చచెప్పి తీసుకువచ్చేవాడట. పొద్దున్న తీసుకొస్తే, రాత్రికి మళ్ళీ వెళ్ళిపోయేదట. రాత్రి తీసుకొస్తే పొద్దున్న వెళ్ళిపోతూండేదట. కనకరాజుకి చిరాకేసి, నిజజీవితాన్ని గురించి ఆమెకు క్షుణ్ణంగా వివరించి, యింటికి పదమని హెచ్చరించి, యిహ మీదవన్నీ పనికిరావని బుద్ధిచెప్పి, తిరిగి అమ్మవాళ్ళింటికి వెళ్ళనీకుండా కట్టుదిట్టం చేశాడట. దాంతో చల్లమ్మకు తిక్కరేగి, చపాతీ పిండిలో నల్లుల మందు కలిపి, జబ్బ శక్తికొద్దీ పిసికి, చపాతీలు చేసి ఆతనికి బొద్దింకల మందేసిన పులుసుతో నైవేద్యం పెట్టిందట. అవి తిన్న కనకరాజు తిన్నగా వైద్య సహాయం కూడా అడక్కుండా పరలోకానికి వెళ్ళిపోయాడట.

## నిరుద్యోగులెందరు?

వుద్యోగాలు కావాలోచ్ అని పేర్లు నమోదు చేయించుకున్న వారిసంఖ్య జూన్ నెల చివరికి 53 లక్షలు దాటిపోయిందట. ఈ నిరుద్యోగుల సంఖ్య విషయంలో యు.పి. ది అగ్రస్థానమట. అక్కడ ఆరున్నర లక్షలట. బీహారయిదున్నర, కేరళ నాలుగున్నర లక్షలట. ఈ సంఖ్య నమ్మడానికి కష్టం. క్షణక్షణం, అమక్షణ ప్రవర్ధమానమయ్యే సంఖ్యలివి ఆమా..

## ఫాలాకుని డైరీ

### 48 గంటలు వెనక్కు నడిచిన యువకుడు!

కోయంబత్తూరుకు చెందిన యన్. పార్థసారథి అనే వా 26 ఏళ్ళ యువకుడు ఢిల్లీలోని జనరద్దీ అధికంగా గల కరోల్‌బాగ్ నడిరోడ్డు మీద నిర్విరామంగా నలభైయ్యేడు గంటల నలభై నిముషాలు కాలం వెనక్కు నడిచాడట.

### 7 సంఘాలకు 51 లక్షలు!

పోయినేప్రిల్ నెలనుంచి ప్రారంభించిన ఏడు ఎంక్వయిరీ కమిషనుల కయ్యే ఖర్చు యాభై ఒక్క లక్ష రూపాయలకు సునాయాసంగా దాటి పోతుందని కేంద్ర హోమ్‌మంత్రి చరణ్‌సింగ్ అన్నారట. ●




"ఏమిటో మా ఖర్మ యిలాగ వుంది! అంత పెద్ద ఆఫీసరయ్యేడు. రెండు చేతులా సంపాదిస్తున్నాడు. ఎందుకు? అందుకే అన్నారు పెద్దలు. 'పూజ కొద్దీ పురుషుడు దానంకొద్దీ బిడ్డలు' అని. ఏ జన్మలోనయినా యింత పెట్టి పుట్టిన వాళ్లయితే కదా" దొడ్లో కూర్చుని వత్తులు చేసుకుంటూ తనలో తను అనుకుంటు న్నట్టుగా గట్టిగానే అంది కాంతమ్మగారు.

బట్టలు పిండుతున్న పెద్ద కోడలు సీత అత్తగారి మాటలు విన్నది ఆమె మనస్సు చివుక్కుమంది.

"అమ్మాయ్ మంగా చంటి పిల్లాడు ఏడుస్తున్నట్టున్నాడే. వినిపించటం లేదూ? వెళ్ళి తియ్యమ్మా. నువ్వేం పని చేయక్కర్లేదు కాని పిల్లల్ని ఏడిపించకమ్మా. కావాలని ఏడ్చేవాళ్ళకు యిస్తున్నాడా భగవంతుడు?" కాంతమ్మ చిన్న కోడలు మంగ నుద్దేశించి అన్నది.

బియ్యం ఏరుతున్న మంగ అవి అక్కడే పెట్టేసి గబగబా లోపలికి వెళ్లింది పిల్లాణ్ణి తీసుకోవడానికి.

పిల్లల మిషతో మంగ ఏపనీ చేయలేదు. ఆమె చేయటానికి వచ్చినా అత్త కాంతమ్మ గారు "పిల్లలతో నీ కెందుకు. పిల్లల్ని ఏడిపించకుండా వాళ్లను చూసుకో చాలు" అంటుంది.

సీతకి అన్ని పనులూ అయ్యేసరికి రాత్రి పది గంటలు అయింది. అలసిపోయిన సీత వసారాలో మంచంమీద పడుకుంది. ఆమెకు ఎంతకీ నిద్ర రాలేదు. ఆమె పెళ్లి అయి ఎనిమిదేళ్లు అవుతోంది. ఆమె పెళ్లి చిత్రంగా జరిగిందనే చెప్పాలి. ఆమె తండ్రి గుమాస్తాగా వుండేవాడు. అప్పటికే యిద్దరాడపిల్లల పెళ్లిళ్లు చేసి అలసిపోయి వున్నాడు. సీత మూడోది. ఆమెని మేనరికం యివ్వాలని అనుకునేవారు. ఆమె బావగోపీకి ఆమెంటే చాలా ఇష్టం. కాని అతనికి పెద్ద చదువూ చెప్పుకోదగ్గ ఆస్తీ లేదు. అయినా కట్నకానుక లివ్వలేని ఆమె తండ్రి అంతకన్న మంచి వరుడిని ఎక్కడ తేగలడు. అందు కని గోపీకిచ్చి చేయాలి అనుకునేవారు. అదే టైములో రాము ఎమ్. ఎస్ సి. చదువుతూ వారి మేడమీద గదిలో అద్దెకు దిగేడు. అప్పటికి ఆమె యింటర్ చదువుతూండేది. రాము ఆమెను పెండ్లి చేసుకుంటానని ఆమె తండ్రి గోపాలరావును అడగటం, ఆయన సంతోషంగా వప్పుకోవటం జరిగిపోయాయి. అప్పటికి ఆమెకు పెండ్లి అంటే పెద్దగా ఏమీ తెలియకపోయినా పాపం గోపీ బావ వాళ్లు ఏమనుకుంటారో అనుకున్నది. అయినా రాము అన్నా గోపీ అన్నా ప్రత్యేకాభిప్రాయాలు ఏమీ ఆమెకు లేవు. ఆమె పెళ్లి రాముతో స్థిరపడిన తరువాత గోపీ వచ్చేడు.

'సీతా నువ్వు రామును చేసుకు సుఖపడతావు. నీకు నేను తగినవాణ్ని కాదు. నీ సుఖమే నా సుఖం. నీ కెప్పుడైనా ఏదైనా

సహాయం కావాల్సివస్తే 'గోపీ వున్నాడు'అని గుర్తు పెట్టుకో' అన్నాడు ఆమెతో అతని ఆ మాటలు సీతకు ప్రత్యేకంగా ఏమీ అనిపించలేదు. అలాగ ఆమె పెళ్లి కట్నకానుకలు పెద్దగా లేకపోయినా, రాము తల్లి అంతగా యిష్టపడక పోయినా కూడా రాముతో జరిగిపోయింది. పెళయిన పది రోజులకే రాము ఎమ్. ఎస్‌సి. యూనివర్సిటీకి ఫస్టు రావటం జరిగింది. ఆ రోజున రాము రాముతల్లి, ఆమె తలితండ్రులు అంతా సీత అదృష్టవంతురాలు, ఆమెలో లక్ష్మీకళ వుంది' అన్నారు.

యింకొన్నాళ్లకు రాము ఐ. ఏ. ఎస్. పాసయి సెలెక్టు కావటం తరువాత ఆఫీసర్ అవటం జరిగిపోయాయి ఆనాడు అందరూ ఆమెని 'సాక్షాత్తూ లక్ష్మీదేవే'అని పొగిడారు.

'చిన్నా నువ్వు వచ్చిన వేళావిశేషం. ఎంత అదృష్టవంతుణ్ని! నువ్వు నా భార్య కావటం నా అదృష్టం' అని రామూ అంటుంటే నిజంగా తనంత అదృష్టవంతురాలు లేదని ఆమె పొంగిపోయింది. అనురాగంతో, ప్రేమతో చూసే భర్త, ఆదరించే అత్తగారు, అపురూపంగా చూసే తలితండ్రులూ, గౌరవంగా చూసే యిరుగు పొరుగు అవన్నీ చూసి ఆమె అనుకునేది' నిజంగా నేను చాలా అదృష్టవంతురాలనని.

అలాగ ఆనందంగా మూడు సంవత్సరాలు మూడు క్షణాల్లాగా గడిచిపోయాయి ఆమెకు

"ఎప్పుడు నాకు బాబును అందిస్తావు" అంటూ ఆ మూడేళ్లు ఆమె చెవిలో గుసగుసలాడిన రాము. మూడేళ్ల తర్వాత—

"ఏమిటో సీతా యింటికొచ్చేసరికి ఏదోగా వుంటుంది. చిరునవ్వు చిందించే చిన్నారి బాబు ఎదురువస్తే ఎంత బాగుంటుంది. ఎప్పటికి నాకా అదృష్టం" అంటూ అదోలా అనేవాడు.

మగవాడైన రాము, అంత చదువుకున్న రామే అలాగ బాధపడితే ఆడది తను ఎంత బాధపడుతుందో అన్న ఆలోచనైనా లేదా రాముకు అనిపించేది ఆమెకు.

రాము ఆమెని వోదార్చటంపోయి ఆమే అతనిని వోదార్చేది.

భర్తను ఏలాగైనా సమాధానపరిచేది కాని, అత్తగారు, ఆమె తలితండ్రులు యిరుగు పొరుగు అంటుంటే ఏమనలేక పోయేది.

ఆమె పెళ్లయిన నాలుగేళ్ళకి ఆమె మరిది పెళ్లికావటం, అతనికి ఏడాదిలోనే పాప పుట్టటంతో అటు అత్తగారికీ,యిటు తలితండ్రులకీ ఆరాటం పెరగసాగింది. ఆమె భర్త రాముక్కూడా నిరుత్సాహం ఎక్కువ కాసాగింది. అన్ని పరీక్షలూ చేయించుకుని, చిన్న ఆపరేషను కూడా చేయించుకున్న ఆమెకు యింకేం చేయాలో బోధపడలేదు డాక్టర్లు 'నీలో లోపం లేదమ్మా. మీవార్నికూడా పరీక్ష చేస్తే బాగుంటుంది' అనేవారు.

అమాటే ఒకసారి రాముతో అంటే.

"ఏమిటి నన్నా నాకేమయింది నాకలాంటి పరీకలేమీ అఖ్కర్లేదు. నువ్వు సరిగా వుండాలికాని నాకేం లోపంలేదు" కోపంగా అన్నాడు రాము. హు మగాడనిపించుకున్నాడు రాము అనుకుంది ఆమె' మగవాడు అతనిలో లోపం వుందేమో అంటే ఛస్తే వప్పుకోడు. అదేదో అతని మగతనానికి తక్కువ అనీ, అవమానమనీ భావిస్తాడు.

అందరూ ఆమెని గొడ్రాలని నిర్ధారణ చేసుకోవటంలో రాముకు సీతపట్ల చిరాకు ఎక్కువ కాసాగింది.

ఆమె మరిదికి మగ పిల్లవాడుకూడా పుట్టాడు. 'యీ పురిటికి సాయంగా సీతను పంపు నాయనా' అని అత్తగారు అడగగానే తక్షణం వప్పుకున్నాడు రాము.

యిదివరలో ఆమెను ఒక్కరోజు పుట్టింటికి పంపటానికికూడా యిష్టపడని రామూ యిప్పుడు ఆమె వచ్చి రెండు నెలలయినా రమ్మని వ్రాయలేదు. నిట్టూర్పు విడిచింది సీత.

"ఏమండీ సీతక్కయ్యకు తెలీదులా వుంది. మీ అన్నయ్యగారు పిల్లలకోసం మళ్లీ పెళ్లి చేసుకుంటారుట. నిన్న అత్తయ్య నాతో అన్నారు." మంగ భర్తతో అంటున్న మాటలు ప్రక్క వసారాలో పడుకున్న సీత చెవులపడి ఆమె వులిక్కిపడింది.

ఏమిటీ రామూ మళ్లీ పెళ్లి చేసుకుంటాడా.

"ఏమిటి అన్నయ్య మళ్లీ పెళ్లి చేసుకుంటాడా. వదిన తలితండ్రులకు తెలీదా. తెలిస్తే వాళ్ళూరుకుంటారా?" మరిది కృష్ణ గట్టిగానే అంటున్నాడు.

## సరదాలు

సరదాకీ హాబీకి వయసుతో సంబంధం లేదు.

ఛాంబర్లయిన్ ప్రధానికి రకరకాల గొడుగులు సేకరించడం హాబీ. చర్చిల్‌కు రకరకాల చేతికర్రలు సంపాదించడం హాబీ. గ్రీకు చక్రవర్తి జార్జికి తన బట్టలు తాను ఇస్త్రీ చేసుకోవడం మడతబెట్టుకోవడం గొప్ప హాబీట! విండ్సర్ ప్రభువుకు తానెవరో ఇతరులకు తెలియకుండా— సినిమా మొదలు పెట్టిన తరువాత మామూలు ప్రేక్షకులలో కూర్చోవటం— సినిమా పూర్తి కాకముందే లేచిరావడం సరదా.

బీవర్ బ్రూక్ ప్రభువుకు ఇంట్లో ఉన్నంతసేపూ నగ్నంగా ఉండటం హాబీ. ఒక్కొక్కప్పుడు ఆయన అలా పచార్లు చేస్తూనే తన కార్యదర్శులకు స్టేట్‌మెంట్ ఇచ్చేవాడట.

జేమ్సు జాన్ అనే ఆయనకు రంగు రంగుల సీతాకోకచిలుకల్ని సంపాదించటం హాబీ. అందుకోసం ఆయన అమెరికా, జపాను, చైనా, బర్మా, జర్మనీ దేశాలు స్వయంగా తిరిగి నలభై సంవత్సరాలు కష్టపడి పదివేల పౌనుల ఖర్చుపెట్టి కోటిన్నర సీతాకోక చిలుకల్ని సంపాదించాడు?! చివరకు ఆయన తిండికి మాడవలసిన పరిస్థితి ఏర్పడిందట!

— గార్ల సుందర్

"మీ వదిన తలిదండ్రులకు తెలియక పోవటమేమిటి. మీ వదిన చెల్లెలు సరళనే యిద్దామనుకుంటున్నారుట" మంగ మాట విని యింకా ఆశ్చర్యపోయింది సీత.

తలితండ్రులకు తన బాగోగులు అక్కర్లేదా అనుకుంది. అయినా రామూ మళ్లీ పెళ్లి పిల్లలకోసం ఎలాగూ చేసుకుంటాడు అనుకున్నారేమో. దాంతో సరళ నిచ్చి చేసేస్తే యింకో కూతురుకి కూడా కట్నం బెడద తప్పుతుంది అనుకున్నారేమో. అయినా తన పెళ్లినాటికి పన్నెండేళ్లుండే సరళని వల్లిగా పిలగా వుండే సరళని రామూ చేసుకోవటానికి వప్పుకున్నాడా. కనీసం తన తలి

# ఆమె నిర్ణయం

తండ్రుకైనా తనమీద జాలిలేదా? జాలి! తన తలితండ్రుల లాంటివారు యీదేశంలో కో కొల్లలున్నారు. పెళ్లయిన కూతురుకు పిల్లలు పుట్టకపోయినా, పెళ్లయిన కూతురు చనిపోయినా యింకో కూతుర్నిచ్చి చేసేస్తుంటారు ఆ తలితండ్రులు కట్నం బెడద తప్పుతుందని వాళ్ల ముఖ్య వుద్దేశం. వరకట్నం యివ్వకూడదు అని ఎన్ని ఉపన్యాసాలు దంచుతున్నా, వివాదాలు చేస్తున్నా చాటు మాటుగా యిది సాగుతూనే వుంది.

"సరే వాడు ఎలా పెళ్ళి చేసుకుంటాడో నేనూ చూస్తాను, అసలు లోపం ఎవరిలో వున్నదో. వదినలో లోపం వుంటే వదినను వదిలి మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడు కదా. ఒకవేళ అతనిలో లోపం వుంటే వదిన మళ్ళీ పెళ్లి చేసుకోవచ్చా" ఆవేశంగా అంటున్నాడు కృష్ణ.

"మధ్య మీ కెందుకు వూరుకోండి" మంగ భర్తను గదమాయించింది.

"ఈ విషయంలో నేను ఛస్తే వూరుకోను. సాటి స్త్రీ గురించి నీకు జాలిలేదా. వాడెల్లాగు చేసుకుంటానన్నాడు? వాళ్లెల్లాగ యిస్తామన్నారు? బుద్ధి లేదూ" ఆవేశంగా అంటున్న కృష్ణ మాటలు విని ఆశ్చర్యపోయింది సీత.

కృష్ణను చదువురాని మొద్దు అనేవారు. ఆ అన్న ఎక్కడ? యీ తమ్ముడెక్కడ? అనేవారు. ఏదో చిన్న వుద్యోగం చేసుకు బ్రతుకుతున్నాడు కృష్ణ. కాని అతనిలో ఎంత సంస్కారం వుంది. అనుకుంది సీత. అతని ఆ మాటలు ఆమెకు ధైర్యం కలిగించాయి.

"అసలు మీ కెందుకు ఆవిడగారి మీద అంత యింటరెస్టు" (ఏదో మా పిన్ని కూతురు వసంతను యిప్పిద్దామని నేను అనుకుంటుంటే) నిష్టూరంగా వున్నాయి మంగ మాటలు.

"ఆమె మీద నాకేం యింటరెస్టు పిల్లలకోసం మళ్లీ పెళ్లెందుకతనికి అని యిప్పుడి పెళ్ళి ఆపితే మనపిల్లల్లో ఒకళ్ళని యివ్వచ్చుకదా. అప్పుడంతా మన కే నే పిచ్చిదానా." నవ్వుతూ మంగతో అంటున్న కృష్ణ మాటలు వినగానే సీత గతుక్కుమంది. యిదా యితని ఎత్తు. ఎవరి ఎత్తులు వాళ్ళవి అనుకుంది రాము మళ్ళీ పెళ్ళి చేసుకునేకంటే యీ పద్ధతే నయం కదా అనుకుంది ఆమె స్త్రీ హృదయం. ఒక వేళ రాము పెళ్ళి చేసుకుంటే మాత్రం తను దూరంగా వెళ్ళిపోవాలి. తిండికీ, బట్టకీ కూడా అతని డబ్బు మీద ఆధారపడ కూడదు. కాని పెద్ద చదువు లేని తనకి వుద్యోగం దొరుకుతుందా. అనుకుంది ఆమె. ఆమె స్మృతి పథంలో గోపి తళుక్కున మెరిశాడు. 'ఏ కెప్పుడైనా ఏదైనా సహాయం కావలసి వస్తే గోపి వున్నాడు అని గుర్తు పెట్టుకో.' అన్న

(36 వ పేజీ చూడండి)









# బైస్కోపు

# బాతాఖానీ

## ఎందుకీ అభిరుచి తేడా?! ...

ఈమధ్య దిల్‌దార్ సినిమా చూశాను. అది చూశాక ఆదేరోజున దాన్ని చూసిన కొంతమంది ప్రేక్షకులతో మాట్లాడాను. దిల్‌దార్ హిందీ సినిమా తెనుగులో తీసిన ఆరవ బాలమురుగన్ కథ 'సొగ్గాడు'కి హిందీ పునర్నిర్మాణం అని అందరికీ తెలుసుననుకుంటాను — ఈ సినిమాలో శోభన్ బాబు ధరించిన సొగ్గాడు పాత్రను "బాకా"గా జితేంద్ర ధరించాడు — జయసుధ వేషాన్ని నాజ్‌నీన్ — జయచిత్ర వేషాన్ని రేఖా వేసుకున్నారు...

ఆదే రామానాయుడు,బాపయ్య ఈ సినిమాని హిందీలో తీశారు! ఎందుకింత మార్పు? — అని చాలామంది కొంచెం ఆశ్చర్యంగా అడిగారు — మన సినిమాలు కొన్ని హిందీలోకి అనువదింపబడగా లోగడ చూసినప్పుడుకూడా — నాలాంటి కొంతమందికి — "ఇట్లా మనం మొదటే తెనుగులో ఈ సినిమా తీసివుంటే యెంత బాగుండేదీ?" అని.

మన చిత్రం సొగ్గాడులో సొగ్గాడ్ని ప్రేమించిన జయసుధ అతన్ని కలలో కాబోయే భర్తగా వూహించుకుంటూ — "చలి వేస్తుందీ — కొరికేస్తోందీ—నలిపేస్తోంది కప్పుకుందాం రారా" లాంటి వికారపు పాటను పాడి వోహో! మని ప్రేక్షకుల్ని గంగ వెర్రులు ఎత్తించేస్తుంది! — యిదే పాత్ర హిందీలోకి వెళ్ళేసరికి — అక్కడ కాలేజీలో చదువుకునే హిందుస్తానీ స్టూడెంట్ — తెనుగు ఆధునిక సాహిత్యం, తెనుగు సినిమాలు చూడదు కనుక కాబోలు — తనకి కాబోయే రైతు బిడ్డని యిట్లా పచ్చిశృంగారంతో ప్రక్కలోకి లాక్కోదు — వాడిని రాజాగా తననో రాణీగా వూహించుకుంటుంది— మన నరాలు మెలితిరిగే తెలుగు పాటా సన్నివేశం రెండూ కూడా కన్నుల పండువుగా హాయిగా ఊహాలోకాల్లోకి హిందీ బైస్కోపులో మన్ని తీసుకుపోతాయి!

ఎవరిదీ టేస్టు?! అక్కడ 'విద్యార్థిని' ఊహ అట్లా — మన మాగాణి గ్రామపు అందాలబొమ్మ వూహ యిట్లాగ వుంటుందా? లేకపోతే మన "చలి చలి" పాట— హిందీ ప్రేక్షకులు;హిందీ సెన్సారు తీసి అవతల పారేస్తారని — నిర్మాత మార్చాడా? –

ఏదీ? ఏడుకొండలవాడా? వెంకటేశా? పాట హిందీలో? హిందీలో సొగ్గాడు హోటల్లో 'లత'ని పెళ్ళాడాక "ఇదే మన వూళ్ళో అయితే అమ్మ చూసేది, బాజాభజంత్రీలు వుండేవి...అవేం లేకుండా యిట్లా పెళ్లి చేసుకున్నామే అంటూ వాపోతూంటే లత "బాకా బాజా లేకపోతేనేం మురళీమోహనకృష్ణుడే మన పెళ్ళికి వేణుగానం వినిపిస్తున్నాడంటూ" — అక్కడే తటస్థపడ్డ శ్రీకృష్ణ పటాన్ని చూపించి — పరస్పరానందడోలికలకు అనువుగా బంధానికి తొలి మెట్టును సూచిస్తున్నట్లు పాడుతుంది —

యెందుకు యీ "తేడా?" మనవాళ్లే తీసిన ఒక సినిమాలో భాష మారంగానే యెందుకు ఈ మార్పు? యిది యెవరి అభిరుచి? నిర్మాతలు తెనుగు ప్రేక్షకుణ్ణి సరిగ్గానే అంచనా కట్టేరా? లేక "ఎక్స్‌ప్లాయిటేషన్"కి తెనుగు ప్రేక్షకుడే "అమ్మంగ చిక్కిన మేక"గా వీళ్లకి దొరుకుతున్నాడా? లేక మన చిత్రాల స్థితికి "సామూహికమైన బాధ్యత" సినిమారంగంలోను వ్యాపారంలోను వున్నవాళ్లంతా తీసుకోవాలా? అన్న ప్రశ్నలే "దిల్‌దార్" హిందీ బైస్కోపు చూశాక చాలాసేపు వేధించాయి.

*[ వీరాజీ ]*



'సీతామాలక్ష్మి'లో రామేశ్వరి

## "సంక్రాంతి" కి "నాయుడుబావ"

కొత్త సంవత్సరంలో సంక్రాంతి పండుగ రోజున, శ్రీ ఎమ్. ఎస్. రెడ్డి "నాయుడుబావ" వర్ణ చిత్రాన్ని విడుదల చెయ్యడానికి నిర్ణయించినట్టు తెలుస్తూంది.

శోభన్‌బాబు కొత్త తరహా పాత్రను పోషించిన యీ చిత్రంలో జయసుధ నాగరికత అమ్మాయిగా, జయప్రద పల్లె పిల్లగా నటించారు. ముఖ్య పాత్రలను సత్యనారాయణ... మోహన్‌బాబు... జయమాలిని పోషించారు.

జనాన్ని ఆకట్టుకునే హాస్యరయిన ఘట్టాలు ఎన్నో వున్న "నాయుడుబావ" వర్ణ చిత్రంలో మల్లెమాలగారి గీతాలు ప్రత్యేక ప్రశంసలకు పాత్రమవుతాయి.

ఈ చిత్రానికి రాజశ్రీ రచన్ను, సత్యం సంగీతాన్ని, ప్రకాష్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు.

# * సినిమా విశేషాలు *

### పండక్కి పట్నవాసం

హీరో కృష్ణ సమర్పణలో పద్మాలయా పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న "పట్నవాసం" చిత్రం షూటింగ్ పూర్తయింది. డిశంబర్‌లో డబ్బింగ్, రీ-రికార్డింగ్ కార్యక్రమాలు పూర్తిచేసుకుని సంక్రాంతికి ఆంధ్రుల ముందుంటుంది.

"మంగళగిరి"లో చిత్రీకరించిన పాట "పట్నవాసం" చిత్రంలో ప్రత్యేక ప్రశంసలకు పాత్రమౌతుంది. పద్మాలయా చిత్రానికి రాజశ్రీ ప్రప్రథమంగా కథ, మాటలు వ్రాయడం "పట్నవాసం" తోనే ప్రారంభం కావడం మరొక విశేషం. హీరో కృష్ణగారికి జంటగా శ్రీప్రియ నటించడం ఇంకొక విశేషం. హీరో కృష్ణగారి స్వంత చిత్రానికి జె. వి. రాఘవులు సంగీతం సమకూర్చడం వేరొక విశేషం. హీరో కృష్ణ, వారి సోదరులు జి. హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావుగారలు చేసే ప్రతి పనిలో ప్రత్యేకత వుంటుందనడానికి పై నిదర్శనాలు చాలవా?

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో రూపులు దిద్దుకునే ఈ కలర్ చిత్రంలో కృష్ణ, విజయనిర్మల, సత్యనారాయణ, నాగభూషణం, రాజబాబు, గిరిబాబు, కాంతారావు, త్యాగరాజు, కాకరాల, సాక్షిరంగారావు, శ్రీప్రియ, రమాప్రభ, కృష్ణకుమారి, కె. విజయ, రాధాకుమారి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

శ్రీ సిరిల్స్ ద్వారా విడుదలయ్యే ఈ చిత్రానికి శ్రీ జి. హనుమంతరావు నిర్మాత; శ్రీ జి. ఆదిశేషగిరిరావు నిర్వహణ, పుష్పాల గోపీకృష్ణ (కెమెరా), కె. గోపాలరావు (కూర్పు), రామలింగేశ్వరరావు (కళ), డి. పత్తిరాజు (ప్రొడక్షన్) సాంకేతిక సారథులు



'చిలిపి కృష్ణుడు'లో ఒక దృశ్యం

### నిర్మాతగా బాబూరావు

నవభారత్ అనే పాపులర్ సీడెడ్ పంపిణీ సంస్థకు అధిపతి అయిన బాబూరావు ఇంతవరకూ పంపిణీదారుగా వుంటూ వస్తున్న విషయం అందరికీ తెలుసు. నవంబర్ 17వ తేదీ మరొక క్రొత్త రంగంలో ప్రవేశించారు బాబూరావు. బాలాజీ ఇంటర్నేషనల్ అనే చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించి తన తొలి చిత్రానికి యం. మల్లికార్జునరావు గార్ని దర్శకుడిగా ఎన్నుకున్నారు.

నారాయణరెడ్డిగారు వ్రాసిన పాటను జె. వి. రాఘవులు సంగీత దర్శకత్వంలో పి. సుశీల గానంచేయడంతో బాబూరావుగారి చిత్ర నిర్మాణ కార్యక్రమం ప్రారంభమైంది.

మురళీమోహన్, సత్యనారాయణ, బాలయ్య, నర్సింహరాజు, శరత్‌బాబు, జయలక్ష్మి, నిర్మల ముఖ్య పాత్రలను పోషించే ఈ చిత్రం షూటింగ్ డిశంబర్ నుంచి వుంటుందని జి. వి. కృష్ణారావు (అలైస్) బాబూరావు తెలిపారు.

మహారథి (మాటలు), నారాయణరెడ్డి (పాటలు) లక్ష్మణ్‌గోరే (కెమెరా), కోటగిరి గోపాలరావు (కూర్పు), కె. రామలింగేశ్వరరావు (కళ), చంద్రమౌళి (నిర్మాణ నిర్వహణ) సాంకేతిక సారథ్యం వహిస్తున్న ఈ చిత్రంలో యువతరాన్ని ఆకర్షించే పెక్కు అంశాలున్నట్టు తెలుస్తూంది.



న్నారు. కథలోని కొన్ని అంశాలను తెలుసుకోవాలని వువ్విళ్ళూరుతున్నారు. చిత్రంలోని విశేషాలను వివరించగలరా? అని దర్శక... కథకుడు శ్రీ దాసరిని అడిగాను.

ప్రజలు వూహించేవి వున్నాయి. ప్రేక్షకులు ఆశించే ఘట్టాలు వున్నాయి. అయినా... ముఖ్య సన్నివేశాలు రివీల్ చేస్తే... ''థ్రిల్'' వుండదు గదా, అన్నారు అగ్రదర్శకుడు.

శ్రీ అక్కినేనితో వర్కు చెయ్యడంలో ''హోప్‌లీనెస్'' వుంది, అన్నారు శ్రీ దాసరి.

''ఈ చిత్రాన్ని ఒక మధుర మనోహర కావ్యంగా రూపొందించడానికి తీసుకున్న ''మా అందరి'' ప్రయత్నానికి ప్రేక్షకుల ఆశీర్వాదం లభిస్తుంది అనేది నమ్మకం నాకుంది'' అన్నారు నారాయణరావు.

## సొగ్గత్తెలు నటిస్తున్న రెండో చిత్రం

శ్రీ రామానాయుడు నిర్మించిన సూపర్‌హిట్ చిత్రం ''సొగ్గాడు''లో నాయిక పాత్రలను పోషించిన జయసుధ... జయచిత్రగార్లు చాలా కాలం తరువాత మరో చిత్రంలో కలిసే అనుకూలతను దర్శకుడు టి. కృష్ణ నిర్వరచారు.

''మంచి బాబాయ్'' వర్ణచిత్రాన్ని నిర్మిస్తున్న శ్రీ బాబుల్‌నాథ్, శ్రీ లక్ష్మణరావు, శ్రీ శోభన్, సత్యనారాయణ, రాజబాబు, మోహన్‌బాబు, శరత్‌బాబు, జయచిత్ర, కె. విజయ, రమాప్రభ, నిర్మలగార్లతో మూడో షెడ్యూలును ప్రవేశించిన విషయం పాఠకులకు తెలుసు.

ఆ చిత్రంలో దీప ఒక నాయిక అనికూడా పత్రికలలో ప్రచారం జరిగింది. అనివార్య కారణాల వల్ల, యిప్పుడా చిత్రంలో జయసుధ నటిస్తున్నది

''సొగ్గత్తెలు'' కలిసిన యీ చిత్రానికి మేలు జరిగేఅవకాశం కథాబలాన్నిబట్టి గ్యారంటీఇవ్వొచ్చు

## రాబోయే శోభన చిత్రాలు

సంక్రాంతి తరువాత వచ్చే శోభన్‌బాబు గారి చిత్రాలు... ప్రేక్షకులను ఆనందపరిచే కథలను గొని వున్నాయి...

లక్ష్మీ ఫిలింస్ కంబైన్స్ వారి ''నిండు మనిషి'', సమత ఆర్ట్స్‌వారి ''మల్లెపూవు'', బాలాజీ చిత్రవారి ''మంచి బాబాయ్'', కవిత ఆర్ట్స్‌వారి చిత్రం. ఈ నాలుగు చిత్రాలలోశోభన్ గారికి వెరైటీ వేషాలు లభించాయి గనుక...ఆయన అభిమానులు పరవశించేది తథ్యము అనిచెప్పొచ్చు

[34వ పేజీ చూడండి]



'స్వర్గసీమ'లో మంజుల



'గోరంతదీపం'లో ఒక దృశ్యం

## దేవదాసు ఆఖరి షెడ్యూలు

''సూపర్ స్టార్'' శ్రీ నాగేశ్వరరావు, ''స్టార్ డైరెక్టర్'' శ్రీ నారాయణరావు కలిసి పనిచేస్తున్న సంచలన చిత్రం ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' ఆఖరి షెడ్యూలును ప్రవేశించింది

''అంగనటి'' వాణిశ్రీతో, దాసరి పనిచేస్తున్న మొదటి చిత్రం యిదే గనుక ఆమెను గూర్చి యీ విలేఖరి అడిగాడు

''ఆమె ఎంతో సహకరిస్తూ, నేను అనుకున్న విధంగా రిజల్టు యిస్తున్నారు ఆమెతో పని చెయ్యడంలో ఎంతో ''ఈజ్'' వుంది... షీ యీజ్ గ్రేట్'' అని వాణిశ్రీ నటనా వైభవాన్ని శ్రీ దాసరి అభినందించారు

డిశంబర్‌లో జరుగుతున్న షెడ్యూలుతో ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' చిత్రం పూర్తవుతుంది, అన్నారు నిర్మాత శ్రీనివాసులు

''దేవదాసు మళ్లీ పుట్టాడు'' చిత్రంపై ప్రేక్షకులు ఎన్నెన్నో వూహలు పెంచుకుంటు



'రౌడీ రంగమ్మ'లో విజయ నిర్మల, నాగభూషణం

## మాతృకలమీద అభివృద్ధి

బిల్లీ వైల్డర్స్ "అపార్ట్‌మెంట్" ఆంగ్ల చిత్రం ఆధారంగా ఖోస్లా చిత్రం "రస్తే కా పత్తర్", కురసోవా చిత్రం "ఇకురు" ఆధారంగా "ఆనంద్", జూలీ ఆండ్రూస్ "మేరీ పాప్పిన్స్" ఆధారంగా "బావర్చి", జపనీస్ చిత్రం "హేపినెస్ టు అలోన్" ఆధారంగా "కోషిష్"... ఇలా ఎన్నో పర భాషా చిత్రాల ఆధారంగా మన సినిమాలు తయారావడం సాధారణమైన విషయమైపోయింది నేడు. ఐతే, మనవాళ్ళు "ఒరిజినల్ పిక్చర్ కన్నా చాలా బాగా ఇంప్రూవ్ చేశాం," అనడమూ కద్దు. ఒక తమిళ చిత్రం ఆధారంగా అమధ్య తెలుగులో ఒక చిత్రాన్ని నిర్మించిన ఓ నిర్మాతను "మీరేం ఇంప్రూవ్ చేశారు?" అని అడిగాను. "మా డైరెక్టర్ కాస్త కాస్ట్లీ డైరెక్టర్ కదా? ఒరిజినల్ ఫిల్మ్‌లో హీరోకు అంబాసిడర్ కారు ఉంటే, మా చిత్రంలో హీరోకి ఇంపాలా కారు పెట్టించాడు. గ్రూప్ డాన్సులు, స్టంట్ సీన్‌లలో తమిళ చిత్రం కన్నా ఎక్కువమంది జూనియర్ ఆర్టిస్టులను పెట్టించాడు. తమిళ చిత్రంలో హీరో భవంతిలో ఒక వైపునే మేడమెట్లు ఉంటే, మా డైరెక్టరు రెండు వైపులా మేడమెట్లు పెట్టించాడు. ఎందుకయ్యా అంటే హీరోయిన్ పాట చిత్రీకరణ కోసం. హీరోయిన్ ఒకవైపు నించి మేడమెట్లు మీదుగా పాడుకుంటూ వెళ్లి, రెండో వైపునించి దిగి వచ్చేస్తుంది. మచ్చుకి ఇవి చాలులెండి" అన్నాడా నిర్మాత.

"గండొందు — హెన్నాణె" అనే కన్నడ చిత్రంలో హీరో కాలికి పాము కాటు వేస్తే, హీరోయిన్ ఆ కాలి గాయంగుండా విషం పీల్చేసి, హీరోను బతికించుకుంటుంది. ఆ చిత్రం ఆధారంగా తమిళంలో తయారైన "రామన్ తేడియ సీత"లో ఎం. జి. ఆర్. చెంపమీద పాము కాటు వేస్తే, ఆ బుగ్గను జయలలిత తన పళ్ళతో నొక్కిపట్టి, విషం పీల్చేస్తుంది. ఇదే చిత్రం ఏ హిందీలోనో తయారైందనుకోండి. ఇంకొంచెం ఇంప్రూవ్‌మెంట్. హీరో పెదవులపై పాము కాటు వేస్తే అక్కడే ఏ జీనత్ అమనో విషం పీల్చి రక్షించేస్తుంది!

# జి. వి. జి. పేజీ

## ఊటీలో ఔట్ డోర్

"డిసెంబర్ మొదటివారంలో ఊటీలో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలు, హోలీ పండుగ నృత్యాలు చిత్రీకరించాం," అన్నారు కవితా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ పతాకం కింద కె. విశ్వనాథ్ దర్శకత్వంలో వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్న డి. వి. ఎస్. రాజు. శోభన్‌బాబు, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, సత్యేంద్ర కుమార్, జయసుధ, శుభ, మాధవి నటిస్తున్నారు. సముద్రాల జూనియర్ మాటలు, మహదేవన్ సంగీతం, జి. కె. రాము ఛాయ, కళాధర్ శిల్పం, కె. బాబూరావు కూర్పు, వి. వి. రామారావు కో డైరెక్షన్, ఎన్. వి. వి. ఎల్. సత్యనారాయణ సహకార దర్శకత్వం వహిస్తున్నారు.

## అందరు — ఆగదు — అదరదు

"మీ చిత్రానికి ఈ పేరు ఎందుకు పెట్టారని" అడిగితే, నిర్మాత కుదరవల్లి సీతారామస్వామి యిచ్చిన జవాబిది: "అందరు — అంటే, చంద్రుడు. ఆగదు — అంటే, సూర్యుడు. అదరదు — అంటే..." అంటూ నా చెవిలో రహస్యంగా చెప్పి, "దీనిని మాత్రం ప్రేక్షకుల ఊహాకు వదిలేద్దాం" అన్నారు. పూర్ణకామరాజు సమర్పణలో ఎస్. డి. లాల్ దర్శకత్వంలో కుదరవల్లి సీతారామస్వామి, గుమ్మళ్ళ లక్ష్మణ రావులు నిర్మించే ఈ వర్ణ చిత్రంలో కృష్ణ, సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, మాడా, అర్జా జనార్దనరావు, భీమరాజు, జయచిత్ర, జయమాలిని, హలం నటవర్గం. మాటలు: గొల్లపూడి. సంగీతం: చక్రవర్తి. గీతాలు: సి. నా. రె., వేటూరి. ఛాయ: పి. దేవరాజ్.



'అల్లరి బుల్లోడు'లో కృష్ణ, జయప్రద

## డబ్బు ముఖ్యం కాదు, బాబే ముఖ్యం

"ఇన్నేళ్లుగా మా బాబును ఎంతో గారాబంగా కాపాడినందుకు కాంపెన్సేషన్ లక్షరూపాయలు," అంటూ రమేష్ నోట్లకట్ట ఇవ్వబోతే, ప్రసాద్ వెగటుగా నవ్వి, "లక్షరూపాయలు! పెంచిన ప్రేమకు విలువ లక్ష రూపాయలేనా? చూడండి, రమేష్‌గారూ! ఎట్టి పరిస్థితుల్లోనూ బాబును వాళ్లమ్మకు దూరం చెయ్యలేను," అన్నాడు రమేష్ ఆవేశంతో "నా బిడ్డను పెంచినంత మాత్రాన మీ స్వంతం అనుకోవడం పొరబాటు మీరు కాదన్నంత మాత్రాన చేతులు ముడుచుక్కూర్చునే దద్దమ్మను కాను. కోర్టు ద్వారానైనా సరే — నా బిడ్డను నేను దక్కించుకుంటాను," అని విసురుగా వెళ్లిపోయాడు ఇంతలో గుడినించి తిరిగివచ్చిన యశోద ఆ మాటలు విని, వాటి అర్థమేమిటని భర్తను అడిగితే, "ఈ బాబు మన బిడ్డ కాదు," అని చెప్పేశాడు ప్రసాద్. యశోద అమాంతంగా మూర్ఛపోయింది.

ప్రసాద్‌గా శ్రీధర్, రమేష్‌గా నరసింహరాజు, యశోదగా ప్రభ పాల్గొన్న ఈ సన్నివేశం పి. చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారౌతున్న శ్రీదేవి ఆర్ట్ కంబైన్స్ "స్వర్గసీమ" లోనిది. మంజుల, అల్లు రామలింగయ్య, రాధికా కిరణ్, పద్మాంజలి, లక్ష్మీకాంతమ్మ, బేబీ రాణి, బేబీ వరలక్ష్మి, సుందరీబాయి ఇతర తారాగణం. సి. కొండారెడ్డి ఈ చిత్ర నిర్మాత.

## మంచిరేవుల్లో మంచిబాబాయ్

భారీయెత్తున వేసిన సెట్‌లో శోభన్‌బాబు, జయచిత్ర, చిరంజీవి శ్రీధర్‌బాబు, చిరంజీవి మాధురి, మరికొందరు నర్తకీమణులు పాల్గొన్న కృష్ణాష్టమి నృత్య సన్నివేశాన్ని నేత్రపర్వంగా ఇటీవల చిత్రీకరించారు డైరెక్టర్ టి. కృష్ణ బాలాజీ చిత్ర నికేతన్ పతాకంలో టి. బాబుల్‌నాథ్, జె. లక్ష్మణరావులు నిర్మించే ఈ చిత్రానికి మాటలు: సత్యానంద్. సంగీతం: మహదేవన్ ఛాయ సుందర్‌బాబు శిల్పం తోట నృత్య దర్శకుడు శ్రీనివాస్

### టైటిల్ అనుసరణ

"శంకర్ సతార్ స్మైమన్" అనే తమిళ చిత్రం తయారవుతోంది. జెస్తవారి జీవిత విధానాలకు సంబంధించిన ఈ చిత్రంలో మంజుల, ఆమె భర్త విజయ్‌కుమార్ నాయికా నాయకులు.



'పట్నవాసం' లో ఒక దృశ్యం

### దాసరి నారాయణరావు 1978 డైరీలోని పేజీలు ఫినిష్ !

జనవరి 4 నించి విజయావారి "స్వర్గ నరక" చిత్రం ప్రారంభం. జనవరితో "దేవదాసు మళ్ళీ పుట్టాడు" షూటింగ్ పూర్తి. (ఫిబ్రవరి విడుదల.) జనవరి 22 నించి కృష్ణంరాజు, మురళీమోహన్‌తో "కటకటాల రుద్రయ్య", ఫిబ్రవరిలో తారకప్రభు ఫిలిమ్స్ "సినిమా తీసి చూడు" ప్రారంభమై, మార్చి – ఏప్రిల్ మాసాల్లో పూర్తవుతుంది. ఏప్రిల్, మే నెలల్లో కల్యాణరామ ఇంటర్నేషనల్, భానోదయా ఫిలిమ్స్ వారి చిత్రాలు, జూలై ఆగస్టు సెప్టెంబర్‌లలో లలితా మూవీస్ చిత్రం, సెప్టెంబర్ 20 నించి మళ్లీ ఎ. ఎన్. ఆర్‌తో దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ కొత్త చిత్రంతో దాసరి నారాయణరావు 1978 లో మరింత బిజీ కాబోతున్నారు

### డాక్టర్లు చిత్ర నిర్మాతలుగా

కృష్ణ పాల్గొనే మరో సినిమాస్కోప్ వర్ణ చిత్రం సరోజినీ ఆర్ట్స్ "చెప్పింది చేస్తా." డాక్టర్ ఎ.వి. కృష్ణారెడ్డి, ఎం.డి. (యు.ఎస్.ఎ.), డాక్టర్ బి. వి. మోహనరంగారెడ్డి, ఎం. డి (యు. ఎస్. ఎ), డాక్టర్ ఎస్. డి. అహమద్, ఎం. బి. బి. ఎస్., ఎం. ఎ. అజీజ్, బి. కృష్ణమూర్తి నిర్మించే ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను ఎం. ఎస్. గోపీనాథ్ వహిస్తున్నారు. కృష్ణ, ఈశ్వరరావు, నరసింహరాజు, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, రమణమూర్తి, చంద్రరాజు, కొత్త నటుడు మధుబాబు, జయచిత్ర, మమత, కవిత వగైరా నటవర్గం. మాటలు, పాటలు : రాజశ్రీ. సంగీతం : సత్యం. ఛాయ : ఎస్. ఎస్. లాల్. కోడైరెక్టర్ : రోసిరాజు. శిల్పం : బి. ఎస్. కృష్ణ. కూర్పు : ఇ. వి. షణ్ముగం.

### నటుని చిత్రానికి నటి దర్శకత్వం

నాగభూషణం నిర్మించే చిత్రానికి విజయనిర్మల దర్శకత్వం వహించనున్నారు. ప్రస్తుతం స్క్రిప్ట్ వర్క్ జరుగుతోంది. కృష్ణ హీరో.

### సినిమా పేర్లతో సరుకులు

ఇటీవల సినిమా పేర్లతో చీరలు, గాజులు, మరికొన్ని సరుకులు రావడం మామూలైపోయింది. ఒక గృహిణి పక్కింటామెను అడిగింది. "ఏదో కొత్త సినిమా పేరుతో వచ్చిన చీర మీరు కొన్నారటగా ? ఎలా వుంది ?"

"ఎలా వుందని చెప్పను. వారం తిరక్కుండానే ఛాయ పోవడం మొదలుపెట్టింది. మూడోవారానికే చిరగడం ప్రారంభించింది," అంది పక్కింటామె.

"ఈ సినిమా గతే ఆ చీరకూ పట్టిందేమో !" అంది గృహిణి నవ్వుతూ. ★



చూడడం — కొంతమంది పెద్దగా, కొంతమంది రహస్యంగా నా గురించి అడగడం — సానుభూతి చూపడం — ఇదంతా చూస్తుంటే నాకు కంపరం ఎత్తింది. ముళ్లమీద వున్నట్లుంది.

—నికితోడు మా వదిన తల్లి వ్యంగ్యంగా వాళ్ల ప్రశ్నలకి సమాధానాలివ్వడం !

నాకు చాలా అవమానంగా తోచింది.

"పిల్లలిద్దర్నీ పంచుకున్నారుకాబోలు !"

"పాపం ! మధ్య పిల్లలు నలిగిపోతారు."

"మొగుడు ఒక మాటన్నా ఆడవాళ్లంకదా— మనం పడాలి !"

"ఆఁ — మనమైతే పడతాం ! చదువుకున్న వాళ్ళు మాట పడతారా ? మేమూ మీతో సమానం అంటారు !"

"అదికాదుట అసలు సంగతి — మాట అనడం కాదు. ఎవత్తెనో పెట్టుకున్నాట్ట—"

రహస్యమైన గొంతుతో పెద్దగా అంది ఒక ధీరురాలు.

కాసేపు అక్కడ కూచున్నా యింక కూచో లేననిపించింది. ఏం చెయ్యను ? అది పరాయి యిల్లు ?

నా అవస్థ గమనించింది వదినే పిల్లవాడికి పాలిచ్చే నెపంతో గదిలోకి వెళ్లి నన్ను పిలిచింది. బతుకు జీవుడా అని లేచి వెళ్లాను. వెళ్లంగానే—

"వాళ్ల మాటలు పట్టించుకోకు మంజా ! నువ్వు ఎక్కడికీ రానేరావు. మా కోసం వచ్చిన నిన్ను యిట్లా అవమానం చెయ్యడం నేను చూడలేను మా అమ్మ తరపున నేను క్షమాపణ అడుగుతున్నాను."

అంది నా భుజంమీద చెయ్యేసి.

పెళ్లి అయినప్పటినించీ గూడా మా వదిన నాకు వదినలాగా కాదు అక్కలాగా వుంది. మా ఇద్దరి మధ్యా చాలా అంతర్యం వుంది. నన్ను వదిన అర్థం చేసుకున్నట్లుగా ఎవరూ అర్థం చేసుకోలేదు.

భోజనాల సమయంలో కూడా వదిన నన్ను తన పక్కనే కూచోబెట్టుకుంది. కొసరి కొసరి తినిపించింది నన్ను.

అట్లాంటి సమయాల్లో వదిన నాకు అమ్మని తలిపింపజేస్తుంది. నా చిన్నతనంలోనే కరువయింది అమ్మ నాకు.

వెళ్తానని చెప్పంగానే 'అప్పుడేనా ?' అంది వదిన.

"సుధ పెళ్లిరోజు దగ్గిరకొచ్చింది. దానికి కావలిసినవి చేసిపెట్టాలి." అన్నాను

మరేం మాట్లాడలేదు వదిన.

కాళ్లకి పసుపురాసి — బొట్టుపెట్టి నాకు చీరె, జాకెట్టు, సుధకి గౌనుగుడ్డ మధుకి కూడా బట్టలు ఇమ్మని ఇచ్చింది.

"ఏమిటి వదినా ఇప్పుడివన్నీ !" అన్నాను.

వాళ్లమ్మ సమాధానం చెప్పింది.

"బావుందమ్మా, ఆ డ బ డు చు వి గ దా. వాళ్లివ్వాలి — నువ్వు తీసుకోవాలి."

ఎందుకావిడ మాటిమాటికీ నా ఆడబడుచుదనం గుర్తుచేస్తుందో అర్థంకాలేదు నాకు

'నేను రాకుండావుంటే బావుండేదా ?"

అనిపించింది.

నేనేం మాట్లాడలేదు.

వదిన నా ఆలోచనల్ని గ్రహించినట్లు వీపు తట్టింది. ఓదార్పుగా !

మరోసారి మేనల్లుణ్ణి ముద్దాడి, అందరితో చెప్పి బయల్దేరాను

"వదినా ! నువ్వు వెళ్లేటప్పుడు మా ఇంటికి వచ్చి మరీ వెళ్లాలి."

అన్నాను వదినతో.

"లట్లాగే — తప్పకుండా !"

చెయ్యి వూపింది వదిన.

సుధ వున్నంతసేపూ పిల్లవాడి దగ్గిరే వుంది. దానికి వింతగా, విచిత్రంగా వుంది వాణ్ణి చూస్తే ! వాడి చేష్టలన్నీ చూస్తూ ఇది రన్నింగ్ కామెంటరీ ఇస్తోంది ప్రతి నిమిషం.

అన్నయ్య వచ్చాడు బస్టాండుకి.

"నేను రేపు వస్తా మంజా — జాగ్రత్త !"

సుధ మామయ్యకి 'టాటా' చెప్పింది.

బస్సు కదిలింది

ఇంటికొచ్చాక — కొన్నాళ్లవరకు మామూలు మనిషిని కాలేకపోయాను నేను.

## 5

అప్పుడే కాలేజీనించి వచ్చి నీరసంగా పక్కమీద వాలాను

వంటావిడ కాఫీ — టిఫిన్‌తోబాటు ఉత్తరాలు కూడా తెచ్చిచ్చింది ఉత్తరాలు చూడంగానే నాలో లేని ఓపిక వచ్చింది. సుధ, మధు రాశారు ఉత్తరాలు. ఇంకోటి వదిన దగ్గిర్నించి

"డియర్ మమ్మీ !

నేను, చి. మధు కులాసానే. నీ ఆరోగ్యం ఎట్లా వుంది ? మొన్న సెలవుల్లో నిన్ను బాగా విసిగించానుకదూ ? ఇంకెప్పుడూ అట్లా చెయ్యను. నిన్ను నవ్వించేట్టుగా మసులుకుంటాను నువ్వెప్పుడూ నవ్వుతూవుండాలి. అదే మాకు బావుంటుంది. నువ్వసలు ఇదివరకటిలాగాలేవు. మాతో మాట్లాడేటప్పుడుగూడా ఏదో విచారంగా వున్నట్లు కనబడతావు. ఎందుకమ్మా ? ఈసారి నీదగ్గిరికి వచ్చినప్పుడు ఇంక అక్కడే వుండిపోతాను. అక్కడే చదువుకుంటూ నిన్ను చూసుకుంటాను.

అమ్మా ! ఒక్కసారి నువ్వు ఇక్కడికి రామ్మా. మేము ఇక్కడ ఎట్లా వుంటామో నీకు చూడాలనిలేదూ ? మా స్కూలు తప్పకుండా నువ్వు చూసితీరాలి.

ఈసారి 'స్నోవైట్' డ్రామా వేస్తున్నాము. దాంట్లో 'స్నోవైట్' వేషం నేను వేస్తున్నాను. వచ్చే నెల్లో గవర్నరుగారు వస్తారుట. అప్పుడు వేస్తా మా డ్రామా. అప్పటికి నువ్వు తప్పకుండా రావాలి. మా ఫ్రెండ్స్ కూడా నిన్ను చూడాలంటున్నారు. వస్తావు కదూ ?

ఇవాళే నాన్న దగ్గిర్నించి కూడా ఉత్తరం వచ్చింది మధు చేత నాన్న నాకు వైట్ బూట్లు, సాక్సు పంపించారు. ఫారిన్‌వి. చాలా



## రా గ మా లి క

బావున్నాయవి. నా వైట్ ఫ్రాక్‌కి మాచ్ అవుతాయి.

ఇంకేం సంగతులు లేవు. నేను బాగానే చదువుతున్నాను.

ఉత్తరం రాస్తావుగా? ఉంటా టా–టా, బై–బై.

నీ సుధ.

ఉత్తరం చదువుతుంటే దాన్ని ఎదురుగ్గా చూస్తున్నట్లే వుంది. నామీద ఎంత ప్రేమ దానికి! నా క్షేమ సమాచారాల గురించి ఎంత ఆదుర్దా దానికి! నన్ను రమ్మంటుంది ఏమిటో నాకు ఎక్కడికీ వెళ్లాలని వుండదు. అందరూ నన్ను చూసి నవ్వుతున్నట్లు, ఎక్కిరిస్తున్నట్లు—ఎగతాళి చేస్తున్నట్లు వుంటుంది నాకు. వెళ్లలేను. పదిమందిలోకి వెళ్లడానికి ఎందుకో నాకు మొహం చెల్లదు.' అది నా పిచ్చి—నా భ్రమ. అంటే—నా బలహీనత అది.

మధు రాసిన ఉత్తరం తీశాను బయటకి.

''డియర్ మమ్మీ —

నమస్తే. ఎట్లా వున్నావు? నేను కులాసాగా వున్నాను. క్రికెట్ బాగా ఆడుతున్నాను. మొన్న మాచ్‌లో కూడా ఆడాను. నువ్వు పంపించిన క్రికెట్ బాట్లూ—బాలూ చాలా బావున్నాయి. నువ్వు పంపించిన డ్రస్సు కూడా బావుంది. నిన్ననే మూన్‌లైట్ డిన్నరు జరిగింది. అప్పుడు నేను కున్నాను అవ్వి నేను ఒక పాట పాడాను. అందరూ లైక్ చేశారది చప్పట్లు కొట్టారు బాగా.

నేను బాగానే చదువుతున్నాను. క్లాస్ ఫస్టు నేనే—మా క్లాసులో మొన్న టెస్టులో గూడా బాగా మార్కులు వచ్చాయి. వచ్చే ఆదివారం మేము ఇక్కడ దగ్గిర ఊరికి 'హైక్'కి వెళ్తున్నాము.

నువ్వెప్పుడు వస్తావు యిక్కడికి? నిన్ను ఈ సెలవుల్లో బాగా 'మిస్' అయ్యాను. వెంటనే ఉత్తరం రాయి.

ఇట్లు,
మధుసూదన్''.

ఉత్తరాన్ని ముద్దు పెట్టుకున్నాను నా చిట్టితండ్రి ఎంత బాగా రాశాడో ఉత్తరం. నా పిల్లలిద్దరూ బుద్ధిమంతులే. వదిన యిచ్చిన బట్టలు కుట్టించి పంపించాను వాడికి. దానికే ఎంత సంతోషమో. పోయిన సెలవుల్లో నన్ను 'మిస్' అయ్యాడుట. ఆ మాటకే నాకు కన్నీళ్లు వచ్చాయి.

వాళ్ల నాన్నకి సుధ కంటే మధు అంటేనే ఎక్కువ యిష్టం ఒక్క క్షణం వదిలేవారు కారు. పురిటి కందుని కూడా ఎత్తుకు తిరిగేవారు. ఎక్కడ పడేస్తారో అని నాకు భయంగా వుండేది. వాడుకూడా ఎంత ఏడుస్తున్నా సరే — వాళ్ల నాన్న ఎత్తుకోంగానే వెంటనే మానేసేవాడు ఏడుపు. ఎన్ని రకాల బట్టలు కొన్నారో వాడికోసం! చిన్న కారు. సైకిలు — గుఱ్ఱం — ఏది బజార్లో కొత్తగా వస్తే అదల్లా మా ఇంట్లో వుండాల్సిందే! మగపిల్లవాడైనా ఎన్నో నగలు ఉండేవి వాడికి. మురుగులు. ఐదు వేళ్లకీ ఉంగిరాలు — వాటితో కలిపిన గొలుసులు — బంగారపు రిస్టు వాచీ — మెళ్లో పులిగోరు గొలుసు — మామిడి పిందెల మొలతాడు — కాళ్లకి గజ్జెలు — అన్నీ వుండేవి. వాడిమీద ఖర్చు చెయ్యడం అంటే ఆయనకి ఎంతో సరదాగా వుండేది. నన్ను అడ్డు పెట్టనిచ్చేవారు కాదు.

ఇప్పటికి కూడా సెలవుల్లో ఆయన దగ్గిరున్నప్పుడు వాడికి అక్కడ ఆడింది ఆట — పాడింది పాట! అన్ని ఆటలూ వాడితో సమానంగా ఆడతారట!

''అమ్మా, ఇంకా కాఫీ తీసుకోలేదా?'' ఖాళీ ప్లేటు తీసికెళ్లడానికి వచ్చిన పనిమనిషి ఆశ్చర్యపోయింది

అప్పటికి తేరుకున్న నేను చల్లారిపోయిన కాఫీని గటగటా తాగి — రెండు ముక్కలు మాత్రం ఎకోడీలు తీసుకుని -- తీసికెళ్లమన్నాను ప్లేటు -- గ్లాసూను. వాటిని తీసుకుని వెళ్లిపోయింది పనిమనిషి.

నా ఆలోచనలో — విచారంలో వుండి నేను వంట చేసుకోనని — సరిగ్గా భోంచెయ్యనని అన్నయ్యే బలవంతంచేసి వంటమనిషిని పెట్టాడు. భాగ్యమ్మగారు కూడా నన్ను కన్నతల్లిలాగా చూసుకుంటుంది. నాకు తోడుగా వుంటుంది. అసలావిడ వంటమనిషి అనే విషయం — నేను — ఆవిడ కూడా మర్చిపోయాం అంటే బావుంటుందేమో!

వదిన రాసిన ఉత్తరం తెరిచాను

''చి మంజులకి ఆశీస్సులు —

నువ్వు ఆరోగ్యంగా వున్నావనుకుంటాను చి. పిల్లల దగ్గిర్నించి ఉత్తరాలు వస్తున్నాయనుకుంటాను. ఇక్కడ మేమంతా క్షేమం. చి. బాబు బోర్లా పడడానికి ప్రయత్నిస్తున్నాడు. మనుషుల్ని కాస్త గుర్తుపడుతున్నాడు.

మీ అన్నయ్య అక్కడికి వచ్చి వెళ్తున్నారా? నేనెప్పుడూ నీ గురించే ఆలోచిస్తూ వుంటాను.

మీ అన్నయ్య నన్ను వచ్చే సోమవారం వచ్చి తీసుకువెళ్తానని రాశారు.

ముందు నీదగ్గిరికే వస్తున్నాము. ఒక పదిరోజులు నీ దగ్గిరుండి తరువాత బెజవాడ వెళ్తాము. మా అమ్మ నాతో వస్తానంది. కానీ నేనే వద్దన్నాను. ఇద్దరు పనివాళ్లు, వంటమనిషీ వుండంగా నాకేం పనుంటుంది? ఎట్లాగో సర్దుకోగలనులే — అని చెప్పాను.

చి. పసివాడికి నీళ్లు — అదీ పోయడం నేర్చుకుంటున్నాను నీ ఆరోగ్యం జాగ్రత్త. ఎప్పుడూ పరధ్యానంగా వుండక, ఏదన్నా మంచి పుస్తకాలు చదువుకో. నేను వస్తున్నాముగా? పదిరోజులు నీకు మంచి కాలక్షేపం -- మీ అల్లుడితో! వుంటాను. లేచాడు వాడు పాలకేడుస్తున్నాడు.

నీ వదిన సుశీల.

వదిన నిజంగా సుశీలే.

కాస్త సంతోషం వచ్చింది మనసుకి. వదినలాంటి స్నేహితురాలు నా దగ్గిరుంటే నాకెంత ధైర్యంగా వుంటుంది? ఏదో కొత్త

ఉత్సాహం వచ్చింది నాలో. మెల్లిగా లేచి బాత్‌రూమ్‌వైపు నడిచాను మొహం కడుక్కుని పది నిమిషాల్లో తయారయ్యాను. తెల్ల నైలెక్స్ చీర — తెల్ల జాకెట్ వేసుకున్నాను. తెల్ల షాల్ కప్పుకుని బైటికి వెళ్ళబోతూ ఆగాను నిలువుటద్దంలో నన్ను నేను చూసుకున్నాను.

కళ్ల కింద నల్లటి చారలు — బుగ్గలు లోతుకుపోయాయి. అక్కడక్కడ తెల్లవెంట్రుకలు మెరుస్తున్నాయి తల్లో. అప్పుడే ముసలి దాన్నయ్యాను నేను. ఏం జీవితం నాది? మోడులాగా బతికితేఏం — చస్తే ఏం?

కానీ — నా పిల్లలో? నేను చస్తే వాళ్లని గురించి పట్టించుకునేదెవరు? తల్లిలేని పిల్లలంటే అందరికీ లోకువే! తల్లెప్పుడూ కడుపులో పెట్టుకుని కాపాడుకుంటుంది పిల్లల్ని అన్నివిధాలా! సృష్టిలో అపూర్వమైనది తల్లి! నా పిల్లలే నాలోకం. నేను బతికేది వాళ్లకోసమే— కేవలం వాళ్లకోసం

బరువుగా నిట్టూర్చి — రాబోయే కన్నీటిని ఎట్లాగో నిగ్రహించుకుని బయటికొచ్చాను.

మంచి సినిమా ఏదన్నా చూద్దాం అనిపించింది నేను సినిమా చూసి ఎన్నాళ్లయిందో?

ఒక్కదాన్నీ అసలే వెళ్లను.

## రాగ మాలిక

పిల్లలుంటే వాళ్ల బలవంతం మీదే ఎప్పుడయినా వెళ్తాను.

మెల్లగా నడుస్తూ రోడ్డెక్కాను. ఇవాళెందుకో నడిచే వెళ్లాలనిపిస్తోంది.

గాలి చల్లగా సేద తీరుస్తోంది.

ఆకాశంలో సంధ్యారాగం ఆహ్లాదకరంగావుంది.

చిలకలు జట్లుజట్లుగా తమ గూళ్లకి ఎగిరి వెళ్తున్నాయి ఆకాశంలో. అవి అట్లా కలిసి వెళ్తుంటే ఆకుపచ్చరంగులోని వింతలు కళ్లకి విందు చేస్తున్నాయి.

గట్టిగా కారు హారన్ వినిపించింది.

తుళ్లిపడ్డాను. పక్కకి తప్పుకున్నాను.

అవునుమరి. ఆకాశం చూస్తూ భూమ్మీద— అందులో రోడ్డుమీద నడుస్తుంటే ఎట్లా?

మహాసుభావుడెవరో హారన్ వేశాడు. లేకపోతే దానికింద పడేదాన్నేమో!

"ఎక్స్యూజ్ మీ—" చటుక్కున ఆగాను. పక్కన ఆగింది కారు.

కారులోంచి ముప్పై — ముప్పైఅయిదేళ్ల యువకుడు దిగాడు. ఫుల్ సూటులో — లేటెస్ట్ స్టైల్లో వున్నాడు.

కారులో ఒక అందమైన యువతి కూర్చునుంది. ఆమె అతడి భార్యేమో! అలంకరణలో అతడికేమీ తీసిపోలేదు.

వాళ్లెవరో — నాతో ఏం పనో అర్థం కాలేదు అట్లాగే చూస్తూ నిలబడ్డాను.

ఆ యువకుణ్ణి ఎక్కడో చూసినట్లుగా వుంది. ఎవరబ్బా? ఆలోచిస్తున్నాను.

"మీ రెప్పుడన్నా బెజవాడలో వుండేవారా?" అడిగాడతను నా దగ్గిరగా వచ్చి.

"అవును —"

"సోమశేఖరశాస్త్రిగారు మీ...?"

"మా నాన్నగారు —"

"మీ పేరు మంజుల కదూ?"

"అవును. మీకెట్లా తెలుసు?"

"మీ ఇంటి పక్కన శేషగిరిరావుగారు వుండే వారు గుర్తుందా?"

"అవును — వుండేవారు..."

"వాళ్లకో అబ్బాయి వుండేవాడు —"

"అవునవును. రామం — రామనాథం — ఆ అబ్బాయి పేరు —"

"ఆ రామాన్నే నేను —" అప్పటికి గుర్తుపట్టాను. కాని — ఆశ్చర్యంగా అట్లాగే చూస్తున్నాను. ఎంత కాలమయింది మేము కలుసుకుని! స్కూల్లో చిన్నప్పట్నించి కలిసి చదువుకున్నాము ఎస్. ఎస్. ఎల్. సి దాకా మేము క్లాసుమేట్సుమి. మా ఇళ్లు కూడా పక్క పక్కనే వుండడంతో బాగా ఆడుకునేవాళ్లం. వాళ్లకి ఒక్కడే కొడుకు అవడంతో వాళ్లకి అతి గారాబం రామం అంటే. నేను, అన్నయ్యా ఎగతాళి చేసేవాళ్లం — 'అమ్మ కూచి —' అని!

"నన్నెట్లా గుర్తుపట్టావు రామం? బావున్నావా? ఈవిడ?..."

"ఎట్లా గుర్తుపట్టానా? నీ మొహం — అచ్చు గుద్దినట్లు అదే పోలిక — అసలు మారలేదు నువ్వు మనిషివి మారినా మొహం పోలికవల్ల గుర్తుపట్టాను నేను.

ఇంక నీ రెండో ప్రశ్నకి జవాబు — నేను నిక్షేపంలాగా వున్నాను.

ఇంక పోతే — ఈవిడ ఎవరన్నావు కదూ? నా శ్రీమతి రాధ... రా—రాధా..."

మెల్లిగా కారు దిగి వచ్చింది రాధ.

"దిసీజ్ మై ఓల్డ్ ఫ్రెండ్ మంజుల—"

నమస్కారం చేసింది రాధ. నేను ప్రతి నమస్కారం చేస్తూ రాధని పరీక్షగా చూశాను. రాధ తల్లి కాబోతోంది — అది గ్రహించాను నేనట్లా చూడ్డంతో తను సిగ్గుపడి తల వంచుకుంది.

"ఎక్కడిదాకా మంజూ — నీ కభ్యంతరం లేకపోతే — మాతో వస్తావా?..."

కారు డోరు తీసి పట్టుకుంటూ అడిగాడు రామం.

నేను క్షణం తటపటాయించి — కారు ఎక్కాను. నాకు మనసుకి కాస్త రిలీఫ్ కావాలి. రాధ నా పక్కనే కూచుంది.

రామం కారు డ్రైవు చెయ్యసాగాడు.

"అన్నట్టు మంజూ — ఒక్కదానివే బయల్దేరావేం?" ముందు అద్దంలోంచి నన్ను చూస్తూ అడిగాడు.

"పిల్లల్ని రెసిడెన్షియల్ స్కూల్లో పెట్టాను"

"ఏం మీ ఆయన అంత బిజీగా వుంటారా? నీతో కలిసి వాక్‌కి రాలేనంత.."

నేనేం మాట్లాడలేదు చిన్నగా నవ్వాను

"రాజు ఎట్లా వున్నాడు? వాణ్ణి చూసి చాలా రోజులయింది."

"అక్కడే వున్నాడు బెజవాడలో —"

"మంజూ — నీలో ఎంత మార్పు వచ్చింది? ఇదివరకు గలగలా మాట్లాడుతూ — చలాకీగా వుండేదానివి — అప్పుడే ముసలమ్మవి అయినావా?"

"అప్పటికీ—ఇప్పటికీ తేడాలు లేవు రామం?"

"ఎందరు పిల్లలు?"

"ఇద్దరు."

ఈసారి నేనే అన్నాను మళ్లీ — "రామం నీలో మాత్రం మార్పే లేదు నువ్వింకా చిన్నపిల్లాడి లాగానే మాట్లాడుతావు."

"అందరికీ వయసు పెరుగుతుంటే — నాకు తరుగుతుంది" నవ్వాడు మళ్లీ

"కంగ్రాచ్యులేషన్స్!" అన్నాను నేను రాధని చూసి.

"ఎందుకు? ఓ..." అని పెద్దగా నవ్వాడు రామం రాధవైపు చూస్తూ.

రాధ ఇంకా సిగ్గుపడింది

అదే ఆమెకు తొలికానుపు అని గ్రహించాను

"అబ్బ! ఇండియాని ఎంత మిస్సయ్యానో"

అన్నాడు మళ్లీ రామం.

"ఏం నువ్విన్నాళ్లూ ఇండియాలో లేవా?"

"ఊహుఁ! మొన్ననే స్టేట్స్‌నించి వచ్చాను పెళ్లయిన సంవత్సరమే వెళ్లిపోయాను. వచ్చి

మూణ్ణెల్లయింది. అప్పట్నించి మా రాధ నన్ను వదలడంలేదు...'' అల్లరిగా నవ్వాడు రామం.

''ఛీ! పొండి.'' ముడుచుకుపోయింది రాధ.

అమాయకంగా అందంగా అద్భుతంగా కనిపించింది ఆ జంట నా కళ్లకి.

అంతలోనే గుండెల్లో ముల్లులాగా గుచ్చుకుంది ఏదో బాధ. అది ఈర్ష్యా? ఏమో!

కారు పెద్ద బంగళా ముందాగింది. గేటు తెరిచాడు నౌకరు.

''ఇదే మా ఇల్లు. ఒకసారి పావనం చేస్తావా?'' దిగి వెనక తలుపు తెరిచి పట్టుకుంటూ అడిగాడు.

''అంతమాటనకు రామం.'' అంటూ దిగాను లోపలికి నడిచాం

''రామా! అప్పుడే వచ్చేశారేం? సినిమా కెళ్తామన్నారుగా?'' అంటూ వచ్చింది ఒక ముసలావిడ.

''బావున్నారా అత్తయ్యగార్రూ?'' ఆవిణ్ణి గుర్తుపట్టాను నేను.

''ఎవరమ్మా?'' అందావిడ కళ్లజోడు సరిచేసుకుంటూ.

''మన మంజులమ్మా! శేఖరం మామయ్య కూతురు. బెజవాడలో మన పక్కింట్లో వుండేవాళ్లు? గుర్తురాలా?''

''మంజూనా? నా తల్లి మంజూనా? ఏమ్మా బావున్నావా? అమ్మా, నాన్నా గూడా దాటిపోయారుగదా? అదృష్టవంతులు వాళ్లు. నువ్విక్కడే వుంటున్నావా అమ్మా? ఏదీ — నీ మొగుడు రాలేదా? పిల్లలెంతమంది?''

ఆవిడ నన్ను కావలించుకుని, వళ్లంతా నిమురుతూ ప్రశ్నిస్తోంది. ఆ సూత్రపు ఆదరణ మర్చిపోయి ఎన్నేళ్లో అయింది నాకు కన్నీళ్లు వచ్చాయి.

ఆవిడ అడిగినదానికి ఏవో సమాధానాలు చెప్పాను.

అంతలో రాధ కాఫీ కప్పుల్తో వచ్చింది.

కాఫీ తాగుతుంటే రామం వాళ్లమ్మ అంది— ''రాక రాక వచ్చావు. ఈపూట భోంచేసి వెళ్దువుగానమ్మా! ఏం.''

నేను కాదనలేకపోయాను

రాధ ఎప్పుడు లోపలికి వెళ్లిందో — ఎప్పుడు భోజనాలకు ఏర్పాటుచేసిందో కూడా తెలీలేదు మాకు

మేము కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాము

మరో అరగంటకల్లా భోజనానికి లేచాం.

చకచకా మెరుపులాగా తిరుగుతూ అన్నం వడ్డించింది రాధ ఒక వరసయాక మాతో కూర్చుంది తనుకూడా! వాళ్ల ఆప్యాయతా... ఆదరణా .. స్వర్గంలో వున్నట్లుంది నాకు.

ఏవేవో మాటలతో — కబుర్లలో టైమెంత గడిచిందోకూడా ఎవరికీ తెలీలేదు. రాధ కూడా మాతో కలిసిపోయి మాట్లాడింది. అసలు నాకా స్వర్గాన్ని వదిలి ఇంటికి వెళ్లాలనిపించలేదు.

తప్పనిసరిగా సెలవు తీసుకున్నాను.

''అప్పుడప్పుడూ వస్తూండమ్మా!'' వాళ్లమ్మ మరీ మరీ చెప్పింది.

''ఈసారి ఆయన్నికూడా తీసుకురావాలి...'' రామం మాటలకి నవ్వొచ్చింది నాకు!

ఆరాత్రి ఎంత ప్రయత్నించినా కళ్లు మూతపడలేదు నాకు.

రామం, రాధ ఎంత చక్కటి జంట! రామం కూడా విదేశాలకి వెళ్లివచ్చాడట...కానీ... ప్చ్ ... నాలాగా అందరూ దురదృష్టవంతులవుతారా? అవగూడదు.

గట్టిగా కళ్లు మూసుకున్నాను.

## 6

సంతోషంగా నిద్రలేచాను.

ఇవాళే వదిన — పిల్లవాడు వస్తున్నారు.

ఇల్లంతా కడిగించి స్వయంగా ముగ్గులు పెట్టాను.

''మంజూ! నాకో ధర్మసందేహం. చదువుకున్న పిల్లవికదా? ఇంత చక్కగా ముగ్గులుపెట్టడం ఎక్కడ నేర్చుకున్నావు?'' చెవిలో గుసగుసగా అడిగారాయన పెళ్లైన కొత్తల్లో.

ఆరోజుల్లో నేను చేసే ప్రతి పనినీ వివరంగా చూసేవారు. చూసినదాన్ని అందంగా వర్ణించేవారు.

ఆయన గుసగుసల్లోంచి వచ్చిన తీయని ఊపిరి నన్ను గిలిగింతలు పెట్టింది. మనసు పులకరించిపోయింది. మొహం ఎర్రబడ్డది. శరీరం వివశమయింది.

సిగ్గుతో ముఖం రెండు చేతుల్తో కప్పుకున్నాను. ఆ చేతులు తొలగించి ఆయన ఇచ్చిన మధురమైన...వి ఎట్లా మర్చిపోగలను?

అప్పుడాయన అన్న మాటలని ఎన్ని జన్మలైనా నేను మర్చిపోగలనా?

''ఇప్పుడెట్లా వున్నావో తెలుసా మంజూ! నా మంజూ ... విరిసిన మందారంలా వున్నావు!''

ఆ మధురస్మృతులే నాకు నిధులు.

''అమ్మగారూ! వంటేం చెయ్యమంటారు?''

ఎర్రబడ్డ నా ముఖాన్ని చూస్తూ అడిగింది భాగ్యమ్మగారు.

చెమ్మన ముఖాన్ని పమిటచెంగుతో తుడుచుకున్నాను.

''వంట సంగతి తరవాత — ముందు టిఫిను చెయ్యాలి. పొంగల్. కొబ్బరిపచ్చడిచేసి — ఉప్మా చెయ్యండి. తరవాత నేను వస్తాను — స్నానంచేసి— ఏదైనా స్వీటు చేద్దాం.''

గబగబా చెప్పాను.

ఆవిడ వంటింట్లోకి వెళ్లిపోయింది.

ఏమిటి నాకీ పరధ్యానం? ఆవిడ ఏమనుకుని వుంటుంది? నా ముఖమెందుకట్లా ఎర్రబడాలి? నేనింకా ఆయన్ని ప్రేమిస్తున్నానా? అవును. నా కంఠంలో ప్రాణం వున్నంతవరకు ఆయన్ని ప్రేమిస్తూనేవుంటాను. ఆయనమీది ప్రేమని చంపుకోలేను. అట్లాగని ఆయనతో కలిసి ఉహూఁ ఛస్తే వుండలేను! నేను పుట్టింది భారతదేశంలోనే కాని ... నేను పూర్వకాలపు పతివ్రతని కాను — కాలేను.

నేను సతీసుమతిని ఎట్లా అవుతాను? మూమ్మాటికీ కాలేను ఎందుకవాలి??



'78 సంవత్సరం తొలి వారంలో భారత్ సందర్శించవస్తున్న అమెరికాఅధ్యక్షుడు జిమ్మీ కార్టర్ — భారతీయులకు అమెరికన్ ప్రజల నూతన వత్సర శుభాకాంక్షల నందిస్తారు

నాలాంటివాళ్లు వుంటేకానీ — ఈ మగాళ్లకి బుద్ధి రాదు ఉన్నా వస్తుందా? ఏమో??

ఆలోచనలకు స్వస్తి చెప్పి స్నానం చేసి వచ్చాను. నీలం గద్వాలు చీర — నీలం జాకెట్ వేసుకున్నాను. జడల్లుకుని వంటింట్లోకి వచ్చాను.

పొంగల్ — ఉప్మా పూర్తిచేసి — పచ్చడి నూరుతోంది భాగ్యమ్మగారు.

వంటిల్లు పరిశుభ్రంగా, అద్దంలాగా వుంచుతుంది ఆవిడ. నాకు అనుగుణంగా నడుచుకుంటుంది ఎప్పుడూగూడ!

సెనగపిండి వేయించి — పంచదార పాకం పట్టాను ఘుమఘుమలాడే నెయ్యిపోసి మైసూరు పాకం చేశాను. కేక్స్ కోస్తుండగా వాకిట్లో కారాగిన శబ్దమయింది ఒక్కంగలో బయటి కొచ్చాను.

నా వెనకే వంటావిడ ప్లేటులో ఎర్రనీళ్లతో వచ్చింది.

కారు దిగిన తల్లీ — పిల్లాడితోబాటు అన్నయ్యకి గూడా ఎర్రనీళ్లు తిసి కాళ్లు కడిగాను.

''నా కెందుకమ్మా...?'' నవ్వుతూ అన్నాడు అన్నయ్య.

''అదేమిటన్నయ్యా? నువ్వు పిల్లాడి తండ్రివి గదా'' నవ్వుతూ అంటూ—బాబుని అందుకున్నాను

'కుడికాలు పెట్టాలి వదినా—'' నవ్వుతూ అన్నాను.

''ఎందుకేమిటి?'' వదిన.

''ఇదే నీ అత్తగారిల్లు. అత్తగారింయినా — ఆడబడుచునయినా నేనేగా నీకు!''

''బాబోయ్. భయమేస్తోంది. రెండువైపులా వేధించుకుతింటావు కాబోలు!'' భయం నటించింది వదిన. అందరం నవ్వాము [ఇంకా ఉంది]

# సినిమా

[21వ పేజీ తరువాయి]

### దశాబ్దం తరువాత ఎన్టీఆర్ జానపదం

పదేండ్ల తరువాత శ్రీ ఎన్టీఆర్ నటిస్తున్న జానపదం ఏప్రిల్‌లో ప్రారంభం కాబోతోంది.

జయలక్ష్మి మూవీస్ తలపెట్టిన సినిమా స్కోప్ జానపదానికి "రాజపుత్ర రహస్యం" అని పేరు పెట్టారు.

శ్రీ ఎన్టీఆర్ ఎన్నో జానపదాలలో లోగడ నటించి వున్న, "రాజపుత్ర రహస్యం"లో ఆయన "టార్జాన్" గా పాత్ర పోషించడం... కొత్తదనాన్ని ఆశించే ప్రేక్షకులకు కనువిందేగదా!

సినిమాస్కోప్‌లో అనూహ్యమైన పద్ధతిలో రూపొందబోయే "రాజపుత్ర రహస్యం" లో ఎన్నెన్నో జనాకర్షణీయమైన బాక్సాఫీస్ పట్లు వున్నట్లు, నిర్మాత శ్రీ సి. ఎస్. రాజు తెలిపారు. "రాజపుత్ర రహస్యం"లో జమున, జయప్రద, సత్యనారాయణ, బాలయ్యగార్లు ముఖ్యపాత్రలను పోషించనున్నట్లు, సహాయ పాత్రలను ప్రముఖులు నిర్వహించనున్నట్లు శ్రీ సి. ఎస్. రాజు చెప్పారు.

ఈ స్కోప్ వర్ణచిత్రానికి తెరవెనుక సారధ్యం వహిస్తున్నవారు ఎవరని? గొల్లపూడి... మహదేవన్, విన్సెంట్. రౌతు ఎవరో తెలుసా? శ్రీ ఎస్. డి. లాల్.

శ్రీ నాయుడమ్మ సమర్పించు "రాజపుత్ర రహస్యం" చిత్రానికి సి. ఎస్. రాజు, లక్ష్మయ్య చౌదరిగార్లు నిర్మాతలు.

### ఎన్టీఆర్ మంచితనం

నమ్ముకున్న వ్యక్తులకు సరయిన సమయంలో సహాయం అందించడం శ్రీ ఎన్టీఆర్‌కు అలవాటే. అందుకే... నమ్మకస్తుడు శ్రీ సి. ఎస్. రాజుకు తన వితరణ శీలాన్ని చూపెట్టారు, మన ఎన్టీఆర్.

### శ్రీ చరణచిత్ర రెండోది

"చరిత్రహీనులు" చిత్రాన్ని అందించిన రాయలసీమ రాజశేఖరరెడ్డిగారికి, ఒక కమర్షియల్ చిత్రాన్ని నిర్మించే వుద్దేశ్యం ఏర్పడింది.

మొదటి ప్రయత్నంగా ఒక ప్రబోధాత్మక చిత్రాన్ని నిర్మించినందుకు... ప్రేక్షకులు మంచి మనసు ప్రదర్శించడం... నిర్మాతకు అమందానందాన్ని కలిగించింది.

భారీ తారాగణంతో, ఒక రంగుల సంగీత వైభవాన్ని నిర్మించడానికి సరిపడే కథను సృష్టించడానికి ప్రముఖ నేపథ్య గాయకుడు... తన మిత్రుడు శ్రీ ఎస్. పి. బాలసుబ్రమణ్యం తోడ్పడుతున్నారని, శ్రీ చరణ చిత్ర అధినేత తెలిపారు.

### మంచి రేవుల్లో కృత్రిమ జలపాతం

బాలాజీ చిత్ర రంగుల్లో నిర్మిస్తున్న "మంచి బాబాయ్" చిత్రం జనవరి 15తో పూర్తవుతుంది అనెడి నిజాన్ని, దర్శకుడు శ్రీ టి. కృష్ణ తెలిపారు.

డిశంబర్ వరకు జరిగిన షెడ్యూలు ఫలితంగా... 13 రీళ్ల చిత్రం పూర్తయినట్లు, నిర్మాతల్లో ఒకరైన లక్ష్మణరావుగారు చెప్పారు

మంచి రేవుల్లో ఒక కృత్రిమ జలపాతాన్ని సృష్టించినట్లు, ఆ జలపాతంలో కథానాయిక జయచిత్ర జలకమాడే దృశ్యాన్ని (పాటను) చిత్రీకరించినట్లు, నిర్మాత శ్రీ బాబుల్‌నాథ్ తెలిపారు.

"మంచి బాబాయ్"గా శ్రీ శోభన్ నటిస్తున్న యీ చిత్రానికి సత్యానంద్ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, సుందరం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

"మంచి బాబాయ్" వర్ణచిత్రంలో జయచిత్ర.. జయసుధ ముఖ్య పాత్రధారిణులుగా నటించ, సత్యనారాయణ, మోహన్‌బాబు, రాజబాబు, అల్లు రామలింగయ్య, శరత్‌బాబు, రమాప్రభ, నిర్మల, కె. విజయ, శ్రీధర్... కాంతారావుగార్లు సహాయ పాత్రలను పోషిస్తున్నారు.

చాలా కాలం తరువాత శోభన్‌బాబుగారి చిత్రం... లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదల గావడం... గమనించదగ్గ విషయం.

### జనవరి 4న హిందీ స్వర్గం... నరకం

తెలుగులో కొత్తవాళ్లతో నిర్మించిన "స్వర్గం... నరకం" చిత్రాన్ని హిందీలో నిర్మించడానికి శ్రీ నాగిరెడ్డి నిర్ణయించిన విషయం, ఆ చిత్రానికి మన అగ్రదర్శకుడు దర్శకత్వం నిర్వహిస్తున్నట్లు పాఠకులకు తెలుసు.

ఆదిలో అనుకున్నట్లు కొత్తవాళ్లతోగాక, జితేంద్ర... సంజీవ్‌కుమార్... వినోద్‌మెహ్రా వంటి పాపులర్ నటులతో హిందీ చిత్రం జనవరి 4న ప్రారంభం అవుతుంది అనెడి వార్తను శ్రీ దాసరి వెల్లడించారు.

విజయా పిక్చర్స్ అధినేత శ్రీ నాగిరెడ్డికి, కొత్త సంవత్సరంలో తెలుగు చిత్రాన్ని చేయగలవని శ్రీ దాసరి చెప్పారు. శ్రీ నాగిరెడ్డిని ఒక వ్యక్తిగానే గాక... ఒక వ్యవస్థగ శ్రీ దాసరి పేర్కొన్నారు

### విజయలక్ష్మికి కథ రెడీ

"మొనగాడు" చిత్రం ఘనవిజయాన్ని సాధించినా... మంచి కథకోసం నిర్మాత శ్రీ త్రివిక్రమరావు ఒకటిన్నర సంవత్సరం వెయిట్‌చెయ్యడం...మంచి ఫలితానికి దారితీసింది. "బలే కథ" తయారైన తృప్తి నిర్మాతకు ఏర్పడింది.

ఫిబ్రవరి నుంచి శోభన్‌బాబుగారిచ్చిన కాల్‌షీట్లకు అనుగుణంగా ... నాయిక జయసుధ దగ్గర కూడా తేదీలను తీసుకున్నట్లు శ్రీ త్రివిక్రమరావు తెలిపారు.

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మించనున్న రెండో చిత్రానికి మొదటి చిత్రానికి సారధ్యం వహించినవారే ... వుండగలరని శ్రీ త్రివిక్రమరావు చెప్పారు.

—శ్రీనివాస్ ★


నవరక్తిని, నవశక్తిని కలిగించే
నెస్‌కాఫే కమ్మని రుచితో
నూతనోత్సాహాన్ని
పొందండి.
నెస్‌కాఫే®
నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ
మైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ


NESTLE
NESCAFE
instant coffee


ప్రపంచంలోకెల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ
NS-CA5-3/77 TEL

6-1-1978 శుక్రవారంమొదలు
12-1-1978 గురువారం వరకు

# వారఫలం

మహేష్

**మేషం:—** వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. శ్రమకలుగుతుంది వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాల బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందో ళన కలుగుతుంది. మీ బాలాకు మనుష్యులె మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**మిధునం:—** వృత్తిలో సాటివారి పోటి పెరుగు తుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖ రులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం జరుగు తుంది.

**కర్కాటకం:—** సాహసిక వ్యవహారాలు బాగుం టాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. సాటి వారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. భాగస్వాము లతో కలిపిచేసే వ్యాపారాలులాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. ముఖ్యంగా లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. సంతా నానికి సౌఖ్య సంతోషాల లభిస్తాయి.

**కన్య:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. పజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమా చారం అందగలదు.

**తుల:—** ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవ హారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది అలంకార వస్తువుల కొంటారు.

**ధనుస్సు:—** కొంతమంది వ్యక్తుల మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. చికాకులు ఏర్పడతాయి. వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. ప్రయాణాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేక మైన వార్తలను వింటారు.

**మకరం:—** వృత్తిలో మాతనావకాశాల లభి స్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో శ్రమకలుగుతుంది. ఉద్యోగంలో కార్య భారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కుంభం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాల కూడా జారిపోవచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం:—** అనుకూలమైన వార్తలనువింటారు' వ్యాపారంలో మీ ప్రయత్నాల ఫలిస్తాయి. ప్రయోజనంగల వ్యక్తులను కలుసుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాల బాగుంటాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాల తెల్సు కొంటారు.

---

గోపీ మాటలు గుర్తుకు వచ్చేయి. ఆ నాడు ఏ దైవం అతని చేత అలాగ అనిపించిందో యీ నాడు తనకి అతని సహాయం కావాల్సి వచ్చింది అనుకుంది ఆమె.

గోపీ యిప్పుడు పెద్ద బిజినెస్‌మేన్. అతని కొక పెద్ద ఫ్యాక్టరీ కూడా వుంది. అందులో తనకేదైనా పని యివ్వకపోతాడా గోపీ అనుకుంది సీత వెంటనే ఒక లెటరు వ్రాసింది అతనికి. ఒకసారి వచ్చి తనని కలుసుకోమనీ అర్జంటుగా మాట్లాడాలనీ వ్రాసింది భర్త అడ్రస్ వ్రాసింది రేపే రాముా దగ్గరకు వెళ్ళితాడో పేడో తేల్చుకోవాలి యీలోగా గోపీ వస్తాడు. అతనితో వెళ్ళి వుద్యోగంలో చేరిపోవాలి. రకరకాల ఆలోచన్లతో కలత నిద్ర పోయింది సీత.

ఆ మర్నాడు కృష్ణ వదినా అన్నయ్య

## ఆమె నిర్ణయం

(18వ పేజీ తరువాయి)

దగ్గరకు వెళ్ళాం తయారవు అంటే ఆశ్చర్య పోలేదు సీత, అతని ఎత్తుతో అతను వస్తున్నాడు' తన పథకంలో తను వెళ్ళా మనుకుంటోంది. ఎవరి గొడవ వాళ్ళది అనుకుంది సీత.

సీత, రాము యీసారి డాక్టరు దగ్గరకు వెళ్ళి అన్ని పరీక్షలూ చేయించుకున్నారు. కృష్ణ తోడుగా వున్నాడు.

యీ పరీక్షలవలన ఎవరిది లోపం అని తెలుతుందో? తనవలన లోపం వుంటే రాము మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా? అదే విషయం రామూని అడగాలనుకుంది ఆమె. కాని అతను ముభావంగా వుండటంలో ఏమీ అడగలేకపోయింది.

రెండు రోజుల తర్వాత ఒకనాడు రాము సీతనెంతో ఆప్యాయంగా పలకరించాడు. దానితో సీతకు ఎంతో ధైర్యం వచ్చింది.

"ఏమండి పరీక్షలు చేశారు కదా! రిజల్టు ఏమయినా వచ్చిందా."భయపడుతూ అడిగింది.

"ఏం అంత యిదిగా అడుగుతున్నావు" అడిగాడు రాము.

"మీరు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలను కుంటున్నారుట. ఆ భయంకొద్దీ అడుగు తున్నాను" సీత అంది.

"ఎవరు చెప్పారు నీకు నిన్ను వదిలి మళ్ళీ పెళ్ళి చేసుకుంటానా యింపాసిబుల్" ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు ఆమెను.

నిజంగా రాము మళ్ళీ పెళ్ళి చేసుకోవటం లేదా. మంగ మాటలకు తను ఎంత భయ

పడింది. ఆ మాటలు పట్టుకుని గోపీ బావకు వుత్తరం కూడా వ్రాసింది. నయం గోపీ బావ రాలేదు అనుకుంది సీత పిల్లలు పుట్టకపోతే పోయె అందమైన బొమ్మల్లాంటి అబ్బాయిని ఒకణ్ణి అమ్మాయిని ఒకత్తెను దత్తత తెచ్చుకుంటే పోతుందికదా. కృష్ణ పిల్లలు నల్లగా తుమ్మమొద్దుల్లాగా వుంటారు ఇంక కృష్ణ ప్లాను సాగనీయకూడదు అని కూడా అనుకుంది సీత.

ఆ రాత్రి కృష్ణ రాము డాబా మీద కూర్చున్నారు. కృష్ణ ఆ మర్నాడు వూరికి వెళ్ళిపోతాడు కదా. తనూ కూర్చుందామని మెట్లు ఎక్కసాగింది సీత ఇంక రెండు మెట్లు లెక్కాలి.

"అన్నయ్యా నువ్వు చెప్పద్దన్నాక యీ విషయం వదినకు ఎందుకు చెప్తాను. చెప్పను" కృష్ణ గొంతు అది.

ఆ మాటలు విన్న సీత అక్కడే ఆగిపోయింది. ఆ మెట్ల మీదే నీరసంగా కూర్చుండి పోయింది ఆమె తల్లో కోటి ప్రశ్నలు వుదయించాయి. రాము తనకు తెలియకుండా మళీ పెళ్లి చేసేసుకుంటున్న విషయమా.

"తెలియనీయకు ఎవరికీ తెలియనీయకు" రాము గొంతు అది. రాము! ఎంతవంచకుడు తనతో ఏమన్నాడు. ఇప్పుడేమంటున్నాడు? సీత తల తిరిగి పోవటం ప్రారంభించింది.

"ఆ పెద్ద డాక్టరు కూడా మీ అన్నయ్యలోనే లోపం వుంది. అది మందుల వలన కూడా సరికాదు. సారీ అన్నారు" కృష్ణ అంటున్నాడు.

# ఆమె నిర్ణయం

"మీ వదిన అడిగింది మీరు మళ్ళీ పెళ్లి చేసుకుంటారా" అని. కాని ఏమనను యిది వరకయితే చేసుకుందామనుకున్నాను కాని నాలో లోపం అని తెలిశాక యింక ఆమెను బాధ పెట్టట మెందుకు అనుకున్నా. అందుకని అంతా వట్టిది అన్నాను" రాము అంటున్నాడు.

"సరే రేపు నేను వెళ్ళిపోతున్నాను మా పెద పాపను పంపుతాను అమ్మతో ఇప్పటి నుండీ చేరదీస్తే బాగుంటుంది కదా" కృష్ణ అంటున్నాడు.

ఆ సంభాషణ వింటున్న సీతకు వళ్ళు కుతకుత వుడికినట్లయింది. కాళ్ళ క్రింద భూమి గిరగిరా తిరుగుతోందా అనిపించింది. కాలింగ్‌బెల్ మోత వినిపించటంతో త్రుళ్ళి పడింది. గబగబా మెట్లు దిగింది. గడియారం వంక చూసింది. టైము ఎనిమిదవుతోంది. ఎవరయి వుంటారబ్బా అనుకుంటూ తలుపు తీసింది గోపీ! ఫుల్ సూటులో హుందాగా నుంచుని వున్నాడు. బయట కారు వుంది. గోపీ వెనకాల నౌఖరు కాబోలు నుంచుని వున్నాడు. తన బావ! తనకోసం పెళ్లి చేసుకోకుండా వుండిపోయిన తన బావ! సీత హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.

"ఒకసారి అర్జంటుగా రమ్మని వ్రాశావు దేనికి. నీ వుత్తరం వచ్చినరోజుకు నేను వూళ్లో లేకపోయాను. యీవేళ ప్రొద్దుటే వచ్చాను నీ వుత్తరం చూశాను వెంటనే బయల్దేరి వచ్చేశాను" గబగబా చెప్పుకుపోతున్న గోపి కేసి ఆశ్చర్యంగా చూసింది సీత.

"యిప్పుడుకాదు బావా రేపు చెప్తాను. డాబా మీద మా మరిది, ఆయన కూర్చున్నారు లోపలికి రా. ఏదో పనిమీద యీ వూరు వచ్చినటు చెప్పు. నేను వుత్తరం వేసినట్లు చెప్పకు" గోపీని లోపలకి ఆహ్వానిస్తూ మెల్లిగా అంది సీత

తరువాత రాము, గోపీ కృష్ణ భోజనాలు చేశారు.

ఆ రాత్రి సీతకు నిద్రేపట్టలేదు. మగవాడికి తండ్రి అవ్వాలని ఎంత ఆశగా వుంటుందో ఆడదానికి తల్లి కావాలని అంతకి పదిరెట్లు ఎక్కువ ఆశగా వుంటుంది రాము! ఎంత గోముఖవ్యాఘం అతని లోపం ఎవరికీ తెయనీయకూడదట. తననిమాత్రం లోకానికి గొడ్రాలుగా చూపిస్తాడు! ఎంత స్వార్ధపరుడు! యీ మగజాతి అంతా యింతేనా అనిపించింది సీతకు. ఆమె కళ్లలో గోపీ రూపం కదలాడింది. పాపం తనమీది ప్రేమతో పెళ్లి చేసుకోక అలాగే వుండిపోయాడు రాము, గోపీ యిద్దరిలో ఎంత తేడా. ఇన్నాళ్ళు తన గురించి ఆలోచించుకోకుండా కాని గోపీ ఏమయిపోయాడు ఏమయిపోతాడు అనుకోలేకపోయానుకదా అనుకుంది ఆమె

మర్నాడు కృష్ణ వూరికి రాము ఆఫీసుకూ వెళ్ళాక

'యిప్పుడు చెప్పు సీతా. నన్నెందుకు అర్జంటుగా రమ్మన్నావు' ఆప్యాయంగా అడిగాడు గోపీ

అతని ఆప్యాయతకు ఆమెలోని దుఃఖం పొంగి గట్టిగా ఏడ్చేసింది.

"ఛ ఎందుకేడుస్తావు బంగారంలాంటి భర్త, హాయిగా వుండలికాని" సీత తల నిమురుతూ బుజ్జగించాడు గోపీ.

'బంగారంలాంటి భర్త! ఆమెలో ఆవేశం కట్టలు త్రెంచుకుంది. జరిగినదంతా చెప్పింది.

"సరే యిప్పుడేంచేస్తావ్ అతనికి తెలిసిందికదా! అతను మళ్ళీ పెళ్లి చేసుకోవటం లేదుకదా యింకెందుకు బాధపడ్తావ్" గోపీ అన్నాడు.

"బావా నువ్వూ మగవాడివని పించుకున్నావ్. మీరసలు ఆడదానిని ఒక వ్యక్తిగా



# ఆమె నిర్ణయం

ఎందుకు అనుకోరు? రాము మళ్లీ పెళ్లి చేసుకుంటాడు అని తెలిసినప్పుడు కృంగి పోయాను. తరువాత నిన్ను వదిలి పెళ్లి చేసుకుంటానా' అన్నప్పుడు పొంగిపోయాను. ఎందుకో తెలుసా నన్ను ఒక మనసున్న మనిషిగానే చూస్తున్నాడు కాని ఆట బొమ్మలాగ కాదు అనుకుని. కాని నిన్న రాత్రి వాళ్ల సంభాషణ విన్నాక అసహ్యించు కున్నాను. నాకూ మనసుంది. ఆ మనసుకి ఆలోచించే శక్తి వుంది. నిజం చెప్పాలంటే ఆడదానికున్నంత జ్ఞానం, బుద్ధిబలం, వివేకం మగవాడి కుండవు కాని యీ సంఘంలో మగవాడు అధికారం చలాయిస్తున్నాడు. ఎందుకో తెలుసా, శారీరకంగా బలమైనవాడు కావటం వలన, రెండోది ఆడదాన్ని అణిచిపెట్టి వుంచే రూల్సు మగవాళ్ళు పెట్టి వుండటంచేత మొదట్లో నిన్ను రమ్మని వ్రాసింది నువ్వేదైనా జాబుయిస్తే నా కాళ్లమీద నేను నిలబడి బతుకుదామని. కాని యిప్పుడు నాకు వుద్యోగం అవసరం లేదు'' సీత ఆగి అతని ముఖంలోకిచూసింది.

''అవును నువ్వు పెద్ద ఆఫీసర్ భార్యవి నీ కెందుకు వుద్యోగం. మరింక నీ బాధేమిటి?''

గోపీ మాటలకు చురుగ్గా అతనికేసి చూసింది సీత.

''మగవాడివైన నువ్వు నన్ను అంతకంటె అర్థం చేసుకోలేవేమో బావా. రాము మీద నా కిప్పుడు విరక్తి కలిగింది. ఇప్పుడు నే నతనితో కాపురం చేయలేను'' సీత మాటలకి గోపీకి ఏం చెప్పాలో తెలియలేదు.

''రాము పిల్లలకోసం మళ్లీ పెళ్లి చేసుకుందామనుకున్నాడు. లోపం తనదే కావటంతో తేలుకుట్టిన దొంగలా వూరుకున్నాడు; కాని నాకు తల్లి కావాలని వుండదా?'' గోపీ ముఖం వంక చూసింది సీత.

ఎందుకుండదు. వుంటుంది. కాని ఏం చేస్తావు? మనకి భగవంతుడు ఎంత రాసిపెట్టాడో అంతే జరుగుతుంది అనుకోవాలి. నా విషయం తీసుకో. నిన్ను నా ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించాను. చిన్నతనం నుంచీ నువ్వే నా భార్యవు అన్న ముద్ర నా మనస్సులో అలాగే వుండిపోయింది. అందుకే వేరమ్మాని పెళ్లి చేసు కోలేకపోయాను. నీ సుఖమే నా సుఖం అనుకున్నాను. పిల్లలు లేకపోతే పోనీ. అతను యిప్పుడు నిన్ను బాగా చూసుకుంటున్నాడుకదా. నువు బాధ పడకు...''

''గోపీ'' సీత ఆ అరుపుకు గోపీమాటలు మధ్యలోనే ఆగిపోయాయి. ఇప్పుడు చెప్పావే ఆ వేదాంతం భగవంతుడు అంటూ వుంటే అది అందరికీ వర్తించాలి కదా. అలాగని అతను సరిపెట్టుకున్నాడా? వాలో లోపం వుంటే మళ్లీ పెళ్లి చేసుకుని తండ్రి అవుదామనుకున్నాడు. ఆదేనా అతనికి నా మీద వున్న ప్రేమ? ఈనాడు నా కోసం పెళ్లి మానుకున్నట్లు నటిస్తున్నాడు. నిజంగా అతనికి నా మీద ప్రేమ వున్నట్టయితే రెండో పెళ్లి మాట ఎత్తేవాడే కాదు. అతను నామీద ఆమాత్రం ప్రేమగా వున్నట్లు కనిపిస్తే అతనికోసం నేను ఏం చేయమన్నా చేసి వుండేదాన్ని. అతను మళ్లీ పెళ్లి చేసుకునైనా తండ్రి అవ్వాలని ఎలాగ వుబలాట పడ్డాడో యీరోజు ఆ పని నేనే

## అంతా నీలోనే....

నువ్వు కనిపిస్తావు
నా ఎట్టెదుట హరివిల్లు విరుస్తుంది
నువ్వు కదులుతావు
నా కళ్లముందు తటిల్లత మెరుస్తుంది.
నువ్వు నవ్వుతావు
నా గుండెల్లో మరు మల్లెలు
పూస్తాయి నువ్వు నడుస్తావు
నా నవనాడుల్లో సెలయేళ్లు
ఉరకలేస్తాయి.

నువ్వు పలుకుతావు
నా మనస్సులో చిలుకలు కిలకిల
లాడుతాయి

నువ్వు పాడుతావు
నా చెవుల్లో గండుకోయిలలు గానం
చేస్తాయి.
నువ్వు నా దరి చేరుతావు
నా జీవితం నందనవనమై
ప్రశోభిస్తుంది
నువ్వు తెరమరుగవుతావు
బ్రతుకు బండబారిపోతుంది.

—ఎస్. ఎస్. నాయకర్







# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం మీ పైరుకు అవసరం విజయ్

పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని. భాస్వరం. పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది. అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.




ఏరియా మేనేజర్
**మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్**
44. కాంతి నగర్ కాలనీ. హైదరాబాదు-500 028





చేసి తల్లినవ్వాలనే కోరిక నాకు పుట్టింది. నాలో నిద్రావస్థలోనున్న ఆ కోరికను తట్టి లేపినవాడు అతనయితే దానికి సార్థకత చేకూర్చవలసినవాడవు నువ్వు'' సీత ఉపన్యాస ధోరణితో చెప్పుకు పోతోంది.

''అంటే నువ్వనేది నాకు సరిగా అర్థం కావటంలేదు సీతా'' గోపీ మాటలు తడబడ్డాయి.

''యింత పెద్ద బిజినెస్ మెన్‌వి. నీకు నిజంగా అర్థం కాలేదా ? నేను రాముకు విడాకులిస్తాను నన్ను పెళి చేసుకుంటావా గోపీ? నన్నింతగా ప్రేమించే నువ్వు యిందుకు వప్పుకోవా'' సీత కంఠం బొంగురు పోయింది

గోపీ ఆశ్చర్యంగా సీత ముఖం కేసి చూడసాగాడు. అతని నోట మాట రాలేదు.

''గోపీ ఎందుకలాగ చూస్తావు? అవును నువ్వూ మగజాతే కదా పాపం మీకు పౌరుషం ఎక్కువ భర్తని వదిలేసిన స్త్రీని, భర్త చనిపోయిన స్త్రీని, పరిస్థితుల ప్రభావానికి కాని, మగవాడి పశు బలానికి బలాత్కారంగా కాని శీలం కోల్పోయిన స్త్రీని వివాహం చేసుకోలేరు మీ మగవాళ్ళు. వాళ్లు ఎంత చెడిపోయినా వారి భార్య మాత్రం మహాపతివ్రతయ్యే వుండాలి. కాని మా

# ఆమె నిర్ణయం

ఆడవాళని చూడు ఎంత అభిమానం పౌరుషం లేనివాళ్ళో భార్యని వదిలేసిన భర్తని, భార్య పోయిన భర్తని, దారితప్పి నడుస్తున్న మగవాడిని అయినాసరే ఆఖరికి భార్య వున్న మగవాడిని అయినాసరే పెళ్ళి చేసుకోటానికి వెనుకాడరు మగవాడికి సంఘబలం వుండటంచేత యివి జరుగుతున్నాయో లేక ఆడదాని అసహాయత, అసమర్థత దీనికి కారణమో నాకు తెలియదు.''

''సీతా'' ఆవేశంగా చెప్పుకు పోతున్న సీతను మధ్యలోనే ఆపాడు గోపీ

''ఆవేశపడకు. నన్నుకూడా అందరిలాంటి వాడిననే అనుకుంటున్నావా? నువ్వు ఆవేశపడకుండా ఆలోచించు నిజంగా మనస్ఫూర్తిగా రాముకు విడాకులిచ్చి నన్ను పెళ్ళి చేసుకోగలవా. అదే నీ వుద్దేశమయితే నీ కోసం నన్సేం చేయమన్నా చేస్తాను. నీ సుఖమే నాకు కావాలి. ఎవరు అడ్డువచ్చినా ఎదిరించి నా ప్రాణానివైన నిన్ను పెళ్ళి చేసుకుని సుఖపెడ్తాను'' గోపీ సీత తల ఆప్యాయంగా నిమురుతూ అన్నాడు.

''నావా నడు యిప్పుడే వెళిపోదాం'' సీత అతని గుండెల్లో తల దాచుకుంటూ అంది.

యింటికి వచ్చిన రాముకు నౌఖరు అప్పన్న తాళంచెవి యిచ్చాడు

''అమ్మగారు లేరా'' రామూ అడిగాడు తలుపు తాళంతీస్తూ.

ఏమో బాబూ తాళంచెవి మీకిమ్మని గోపీ బాబు గారితో వెళ్ళారు. అంటూ బయట తన ఔట్ హౌస్‌లోకి వెళ్ళిపోయాడు అప్పన్న

డ్రస్సు మార్చుకుంటున్న రామూకు టేబుల్ మీద తన డ్రస్‌లో వున్న కవరు కనిపించింది. విప్పి చూశాడు.

రామంగార్కి,

నాలో నిద్రావస్థలో నున్న తల్లి కావాలనే కోరికను తట్టి లేపినందుకు చాలా థాంక్స్. తల్లికావటానికి వక్రమార్గాలు పడుతూ పైకి పతివ్రతలా కన్పించాలనే దుర్బుద్ధి నాకు లేదు. అందుకని సక్రమంగా తల్లినవ్వాలని అనుకుంటున్నాను అందుకే మీకు విడాకులిచ్చి మళీ పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించాను. యీ మారే సమాజంలో బావలాంటి మంచి మగళ్ళు వుంటుంటే నాలాంటి సీత కథలు సుఖాంతంగా మారుతుంటాయి.

— సీత.

# ?



# మాయాజాలం మతికట్టు



అది అక్టోబరు 10వ తేదీ ఉస్మానియా మెడికల్ కాలేజీ, ఉస్మానియా జనరల్ హాస్పిటల్ స్వర్ణోత్సవాల సందర్భంగా, ఉస్మానియా మెడికల్ కాలేజీలో బ్రహ్మాండమైన మెడికల్ ఎగ్జిబిషన్ ఏర్పాటుచేసి ఆ రోజుకి 10వ రోజు

అక్టోబర్ 1వ తేదీనాడు రాష్ట్ర గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ లాంఛనంగా ప్రారంభోత్సవం గావించారు ఎగ్జిబిషన్‌లో స్పెషల్ ఎట్రాక్షన్‌గా నా మాజిక్ ప్రదర్శనలు ఒక ఆడిటోరియంలో ఏర్పాటు చేశారు.

ఒక ప్రక్క ఫోరెన్సిక్ మెడిసిన్ వాళ్ళ ఫిలిం ప్రదర్శనలు, వేరొకవైపు సెక్సు ఎడ్యుకేషన్‌పై ఫిలిం ప్రదర్శనలు, మరో వైపు వివిధరకాల పాముల ప్రదర్శన. యింకా వేనిషింగ్‌మాన్, టాకింగ్ స్కల్ కూడా ఏర్పాటు చెయ్యబడ్డాయి.

అసలే మెడికల్ ఎగ్జిబిషన్ గురించి రేడియో ల ద్వారాను, పత్రికల ద్వారాను, మ్రోగిపోయిందేమో ఎక్కడ చూసినా ఇసుక రాలనంత జనం. దానికి తోడుగా నేను రోజూకంటే రెండు ప్రదర్శనలు అదనంగా యివ్వాల్సి వచ్చింది.

అప్పుడే నా 42వ ప్రదర్శన ముగించుకుని ఆడిటోరియంలో నుండి బయటపడి, తర్వాత ప్రదర్శన మొదలుపెట్టేలోపుగా కాస్త రిలాక్సు అవుదామని ఎగ్జిబిషన్ కేంటిన్ వైపుగా దారితీశాను.

ఇంతలో ముగ్గురు ప్రొఫెసర్లు కూడా కాంటిన్‌వైపుగా వస్తున్నారు.

సరే అంతా కలిసి కాంటిన్ చేరుకుని, కార్నర్‌లోవున్న టేబిల్‌వద్దకు చేరి టేబిల్ చుట్టూ కూర్చుని కబుర్లలోకి దిగాము.

"సమోసా, మిర్చి బజ్జీ, ఆలూ బోండా..." దండకం చెప్పాడు సర్వర్. మా కబుర్లు భంగపరుస్తూ.

"నాల్గు ప్లేట్ మిర్చి బజ్జీ" ఆర్డరిచ్చాడు ఎదురుగా కూర్చున్న ప్రొఫెసర్ గారు.

సర్వర్ మరుక్షణం నాలుగు మిరపకాయ బజ్జీ ప్లేట్లు మా ముందుంచి వెళ్ళాడు.

తింటూ మళ్ళీ కబుర్లలోకి దిగాము. వివిధ రకాల ఎగ్జిబిషన్ల గురించి, యిదివరకూ ఎవరెవళ్ళు ఎంతెంత గొప్ప ఎగ్జిబిషన్లు చూచారో, ఫారిన్ కంట్రీస్‌లో ఎగ్జిబిషన్లు ఎంత బాగా ఆర్గనైజు చేస్తారో, మన దేశంలోని వివిధ పారిశ్రామిక, వైద్య ప్రదర్శనల గురించి మాట్లాడుకుంటూ ఆఖరికి ప్రస్తుతం మా మెడికల్ ఎగ్జిబిషన్‌ని యింకా ఎట్రాక్టివ్‌గా చేయడానికి ఏ ఏ స్టాల్స్ దగ్గర పబ్లిసిటీ, డెకొరేషన్ యిన్‌టెన్సిఫై చెయ్యాలో మాట్లాడుకుంటూండగా, ఇంతలో నా ప్రక్కగా కూర్చున్న ప్రొఫెసర్‌గారు, మధ్యలో కలగచేసుకుని నా 'మతికట్టు' విద్య గురించి, నా ప్రదర్శనల గురించి మాట్లాడుతూ...

మిష్టర్ కామేష్, "మీ మెజిషియన్స్ స్టేజిమీద మాత్రమే ప్రదర్శనలిచ్చి గొప్పలు ప్రదర్శిస్తారు మీరు ధైర్యం వుంటే సరంజామా ఏమీ లేకుండా యిప్పటి కిప్పుడు ఏదైనా మాజిక్‌చేసి చూపండి చూద్దాం" అంటూ విరుచుకు పడ్డాడు.

ఇదెక్కడి గొడవరా అని నాలో నేను గొణుగుకుంటూండగా...

మిగిలిన ప్రొఫెసర్లిద్దరూ కూడా ఏకీభవించి మీదపడ్డారు.

ఇదంతా చూస్తున్న కాంటిన్‌లోని మిగిలిన జనం, నేను ఏమీ చెయ్యబోతున్నానా అని నావైపే ఆతృతతో చూడడం ప్రారంభించారు.

వాతావరణం చూస్తే తప్పించుకోడానికి ఛాన్సు లేకుండా వుంది.

ఇంతలో నాకొక ఐడియా తట్టింది!?

ప్రక్కన కూర్చున్న ప్రొఫెసర్ గారి వద్దనుండి చేతిరుమాలు అడిగి తీసుకుని, నా కుడిచేతిని మూసి, దానిపై రుమాలు వుంచి బొటనవ్రేలుని రుమాలు క్రిందగా ఎత్తి వుంచాను.

తర్వాత కాంటిన్ బిల్ క్లర్కు టేబిల్ మీదున్న పది పదిహేను గుండుసూదులను ప్రొఫెసర్‌గారు తీసుకురాగా తలొక సూది యిచ్చి, రుమాలు మీదుగా బొటనవ్రేలు లోపలికి గుచ్చమన్నాను

ఒకరి తర్వాత ఒకరు గుండుసూదులను రుమాలు మీదుగా బొటన్నవేలు లోపలికి గుచ్చడం ప్రారంభించారు.

సాధ్యమైనంతవరకూ బాధ భరిస్తున్నా ఒకేసారి అన్నిసూదులు బొటనవ్రేలు లోపలికి చేరుకుపోవడంతో మొహంలోని బాధ వ్యక్తం చేయకుండా వుండలేకపోయాను.

ఇదంతా చూస్తున్న ప్రొఫెసర్లతో సహా కేంటిన్‌లోని జనం అంతా ఆశ్చర్యంతో

"హేట్స్ ఆఫ్ మిష్టర్ కామేష్" అంటూ ఎవరు గుచ్చిన సూదులు వారు తీసేస్తూ, ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటూ, ఆ విధంగా ఒళ్ళు జలదరింపజేసే మాజిక్‌ని చేసి సెన్సేషన్ కలిగించినందుకు నన్నభినందించారు

ఆ మరుక్షణం కాంటిన్ అంతా చప్పట్లతో దద్దరిల్లి పోయింది.

అందరూ చప్పట్ల హడావిడిలో వున్న ఆ సమయంలో ప్రదర్శన ముందుగానే రుమాలు క్రింద బొటనవ్రేలుకి బదులుగా ప్లేటులో నుండి, హస్తలాఘవ ప్రజ్ఞతో అందుకున్న 'మిర్చిబజ్జీని' నైస్‌గా ప్లేట్‌లోకి వదిలేసి ఫైన్‌గా మొహం పెట్టేశాను.

— భావరాజు కామేష్

# హైదరాబాద్ నోట్‌బుక్ — తిరుమల రామచంద్ర

## సరికొత్త అంకితోత్సవం :

ఈ జీవితపుబాటలో చెలిమిచేతులు కలిపిన స్నేహితులందరూ! పే. పేరునా పేర్కొనవలసినంత మాత్రాన వారిపట్ల ప్రేమాభిమానాలు తక్కువని మాత్రం కాదు. హితులకు స్నేహితులకు స్నేహాభివందనాలు అంటూ నేస్తమే సమస్తమనుకొన్న శ్రీమతి లక్ష్మీరమణ స్నేహచిత్రాలు వచనకవితా సంపుటిలో స్నేహానికి చెరగని రూపం కల్పించి, సంపుటిని 47 మంది నెచ్చెలులకు అంకితమిచ్చి, సభాముఖంగా దాన్ని వారందరికీ అందజేసి సాహిత్యరంగంలో — అందులో ఆ అంకిత సంప్రదాయంలో సరికొత్త పద్ధతిని ప్రవేశపెట్టారు. నవంబర్ 16న సారస్వతపరిషత్తు హాలులో శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతన జరిగిన సభలో అంకితం పుచ్చుకొన్న 47 మంది మహిళామణులు వేదిక మీదికివచ్చి, పుస్తకాన్ని స్వీకరిస్తూ వుంటే, కన్నులపండువుగా వుంది. కవితాసంపుటిని, ఆవిష్కరించిన డాక్టర్ గోపాలరెడ్డి అన్నట్టు కవితను, కావ్యాన్ని కన్య అనడం, అంకితం పుచ్చుకొన్న వాణ్ణి అల్లుడనడం, కన్యాదానమనడం. ఈ సింగినాదం ఎందుకు? స్నేహంగా ఇచ్చాము, గౌరవంతో ఇచ్చాము అంటే పోలా? ఈ సంప్రదాయాన్ని తోసి రాజంటూ శ్రీమతి లక్ష్మీరమణ —

చిత్రిస్తున్న నేస్తమా
నా హృదయ శతపత్రంపైన
శతకోటి స్నేహ చిత్రాలు

అంటూ శాశ్వత తైలవర్ణచిత్రాలు చిత్రించారు. అంకితం పుచ్చుకొన్న మహిళలు, వారి ప్రతినిధులు కృతజ్ఞత తెలిపినారు. డాక్టర్ అరిపిరాల విశ్వం ప్రపంచంలో స్నేహబంధంలో పరస్పరం గొప్పవారై ప్రపంచానికి అపూర్వసేవ చేసిన హెర్మన్‌హెస్ థామస్ మాన్, వర్డ్స్‌వర్త్ — కలరిడ్జ్ మొదలయిన వారిని ఉదహరించి సంపుటిలోని కొన్ని ఖండికలు పఠించారు. డాక్టర్ నాయనికృష్ణకుమారి, శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి రచయిత్రితో తమకుగల పరిచయాన్ని ఆమె కవితా పరిణామాన్ని వివరించారు. శ్రీ కోవిల్ కందాడై రఘునాథాచార్యుల వందనసమర్పణ చేసేసరకుగాని మూడుగంటలు గడిచాయని తెలియలేదు.

## కుమారి అనితా రత్నం నృత్యాలు :

కుమారి అనితారత్నం రంగరాజు అమెరికాలో సంగీత నాట్యనాటిక, రంగస్థలాలంకరణాది వివిధ లలితకళలలో ఎం. ఎ. డిగ్రీ కోసం అధ్యయనం చేస్తున్నారు. ప్రబంధ సుందరిలాగ ఉండే అనిత సహజంగానే చూపరులను ఆకర్షిస్తున్నప్పుడు భరతనాట్య భంగిమలలో చెప్పనక్కరలేదు. బహామాస్‌లో జరిగిన యోగామహాసభలోను, పెన్సిల్వేనియా వెంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల సమయంలో అనిత భరతనాట్యం ప్రదర్శించి భక్తులను ఆనందింపజేసింది. అడయార్ కళాక్షేత్రంలోను, ముఖ్యంగా అడయార్ లక్ష్మణన్, త్రివ్యార్ పి. రామనాథన్‌ల వద్ద భరతనాట్యం, మోహినీఆట్టం, భరతనాట్యం అభ్యసించింది. విదేశాలలో ముఖ్యంగా అమెరికాలో వివిధ ప్రాంతాలలో భరతనాట్యం జరిపి, నాట్యకళామణి అనే బిరుదం పొందింది. డిసెంబర్ 10న రవీంద్రభారతిలో మోహినీఆట్టం. 11న కీస్ హైస్కూలులో భరతనాట్యం, కళాసాగరం ఆధ్వర్యాన ప్రదర్శించింది. సుప్రసిద్ధ నర్తకి సోనాల్ మాన్‌సింగ్ తర్వాత అంగసౌష్ఠవంలో ఈమెనే పేర్కొనవచ్చు. 11న ప్రదర్శించిన భరతనాట్యములో ఎనిమిదిరాగాల నిత్యకళ్యాణి నిగమాంత సంచారిణి అనే వర్ణం అభినయం గొప్పగా ఉంది. కాని, గంభీర భాషిణి అన్న విశేషణం అభినయం అనుగుణంగా కనిపించలేదు శ్రీ అడయార్ లక్ష్మణన్ ఆచార్యత్వం [నట్టువాంగం] గంభీరంగా ఉంది. శ్రీమతి రాజేశ్వరి మధురగాత్రం నృత్యానికి మెరుగు తెచ్చింది. కాని, ఆమె నమచ్చివాయ వంటిమాటల ఉచ్చారణ బాగాలేదు. తమిళులు మన తెలుగు కీర్తనలను వేదంలాగా చదివి శాస్త్రీయత చెడకుండా కాపాడుతున్నారు. వారికి మహాప్రాణాల ఉచ్చారణ, ద్విత్వాక్షరాల వుచ్చారణ సరిచేసుకొనడం పెద్ద విషయం కాదు.

## కవి కుందుర్తికి కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు :

కేంద్రసాహిత్య అకాడెమీ ఏటా ఉత్తమ తెలుగు రచనకు యిచ్చే అవార్డు ఈఏడు [1977] వచనా కవితాపితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులకు లభించింది. ఒక తామ్రపతకం, ఐదువేల రూపాయలు బహూకరిస్తారు శ్రీ కుందుర్తికి నగరంలో వాన కవితాసంపుటికి 1970లో రాష్ట్రసాహిత్య అకాడెమీ పురస్కారం లభించింది.

## రాష్ట్ర రాజకీయాలలో తుఫాను :

దేశం రాజకీయాంతీరు కల్లోలభరితంగావుండగా మనరాష్ట్ర రాజకీయాలు ఇటీవల వచ్చిన పెను తుఫానుపాలివున్నాయి. ఒక గాలివాటుకు కొంతకాలం పూహాగానం, మరొక గాలివాటుకు మరొక వూహాగానం — ఏది నిలకడగా లేదు. జాతీయ కాంగ్రెస్ చీలదని శ్రీ బ్రహ్మానందరెడ్డి పదేపదే చెబుతున్నారు గనుక చీలకపోవచ్చునేమో గాని, రాష్ట్ర కాంగ్రెస్ మాత్రం అనేకధా చీలుతుందనడంలో సందేహం లేదు. ఇందిర అనుకూల వర్గం, బ్రహ్మానందరెడ్డివర్గం, పిడతల రంగారెడ్డివర్గం, పీటిమధ్య తటస్థవర్గం — అబ్బ! ఎన్ని వర్గాలు? జనతాలో పదవులకు కొందరు రాజీనామా యిచ్చినా, వర్గాలుఏర్పడకపోవడం ప్రశంసనీయమే. డిసెంబర్ మొదటివారం హైదరాబాద్‌లో సమావేశమయిన రాష్ట్ర జనతాకార్యవర్గం రాష్ట్రప్రభుత్వం తుఫాను బాధిత ప్రాంతాలకు సహాయం ఒదిగించడంలో కృతకృత్యం కాలేదు గనుక, దానిని వెంటనేతొలగించి, రాష్ట్రపతిపాలన విధించాలని కేంద్రానికి విజ్ఞప్తి చేసింది. ప్రత్యేకంగా విధించడం ఎందుకు? అత్యయిక పరిస్థితిని రద్దుచేసే సవరణలు రూపొందిస్తే రాష్ట్రవిధానసభలగడువు పొడిగింపు రద్దయి రాష్ట్ర ప్రభుత్వాలు వాటంతట అవే కుప్పగా కూలిపోతాయి గదా! — అని రాజకీయ పండితులు అంటున్నారు.

## ఉపగ్రంథి :

ఏమ్‌సార్, రాష్ట్రంలోని రాజకీయాలను గురించి వ్రాయడం లేదు మీరు? అరటిగాడు ఒక యువ జిజ్ఞాసువు ఏమి వ్రాయమంటారు? ప్రెస్‌లో ఫ్యాషన్లలాగా, జవరాండ్ర చిత్తాలలాగ క్షణక్షణమూ మారిపోతూంటే, ఎప్పటికప్పుడు సద్దివార్తలవుతూండెనాయె! అని ఒక వృద్ధరాజకీయ వేత్త మధ్యలోనే అందుకొని సమాధానం చెప్పారు.★



# కుటుంబానికి తగిన సంపూర్ణ ఆరోగ్య పానీయం.

**హరికి భోజనం చేసే తీరిక లేదు...**

కాంప్లాన్ అతనికి తక్షణమైన ఆహారం.
తొందరగా వెళ్లాల్సిన వారందరికి
ఆదర్శవంతమైనది—అధికారులైనా,
ప్రయాణీకులైనా, ఆఫీసుకు వెళ్లేవారైనా.

**రవి భోజనం సరిగా చెయ్యడు...**

కాంప్లాన్‌లో ఉండే 23 అతిముఖ్యమైన
ఆహారాలు ఇచ్చే 'సంపూర్ణ' పోషణ
అతనికి ఏ ఇతర ఆరోగ్య పానీయం ఇవ్వలేదు.
అతని పోషణలో లోపం ఎలాంటిదైనా
కాంప్లాన్‌తో అతను ఆరోగ్యంగా ఉంటాడు.

**అమ్మకి సుస్తీగా ఉండి భోజనం చెయ్యడం లేదు...**

కాంప్లాన్‌తో ఆమె త్వరగా
కోలుకొంటుంది. 'సంపూర్ణ'
పోషణకు డాక్టర్లు దీనినే ఎక్కువగా
సిఫార్సు చేస్తున్నారు.

**అలసటవల్ల నేను భోజనం చెయ్యలేక పోతున్నాను...**

ప్రతిరోజూ ఒక కప్పు కాంప్లాన్ నన్ను
ఆరోగ్యంగా, శక్తివంతంగా ఉంచడమేకాక
పైకి కనబడని ఆహార లోపాలనుంచి కాపాడుతుంది.

## ఒక్క కాంప్లాన్® మాత్రమే బలానికి, శక్తికి కావలసిన 23 అతి ముఖ్యమైన ఆహారాలను సంపూర్ణంగా కలిగిఉంది.

ఒక్క కాంప్లాన్‌లోనే, ప్రతి రోజూ మీ శరీరానికి కావలసిన ప్రొటీనులు, విటమినులు, ఖనిజ లవణాలు, కార్బోహైడ్రేట్‌లు, ఇతర ముఖ్యమైన ఆహారాలు - శాస్త్రీయంగా కూర్చబడిన పాళ్లలో ఉన్నాయి.

కమ్మని చాకలెట్,
ఏలకికాయ-కుంకుమ
పువ్వు రుచులలో
కూడా లభిస్తుంది!




| | |
|---|---|
| ప్రొటీన్ | నికొటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | కోలిన్ |
| కేల్షియమ్ | కాల్షియమ్ పాంటొథెనేట్ |
| లిపిడ్స్ | పైరిడాక్సిన్ (బి6) |
| ఫాస్ఫరస్ | విటమిన్ బి12 |
| సోడియమ్ క్లోరైడ్ | ఫోలిక్ ఏసిడ్ |
| (సి.ఎల్. రూపంలో) | విటమిన్ సి |
| పొటాషియమ్ | విటమిన్ డి |
| ఐరన్ | విటమిన్ ఇ |
| అయోడిన్ | విటమిన్ కె |
| విటమిన్ ఎ | వీటన్నిటితోపాటు ట్రేస్ |
| విటమిన్ బి1 | ఎలిమెంట్స్ (ఆరోగ్యకరమైన |
| రిబోఫ్లావిన్ | జీవ ప్రక్రియల కోసం) |

**పాలు కలపనవసరం లేదు.**

# కాంప్లాన్®

ప్రపంచ వ్యాప్తంగా విశ్వసనీయమైనది.

CASGC-27-234 TEL

గ్లాక్సో

# ప్రశ్నావళి * — కె. రామలక్ష్మి

**బి. ఎస్. జి — విజయనగరం**

ఆడదంటే ఆట బొమ్మ అంగట్లో తోలుబొమ్మ మనసులేని గాజు బొమ్మ. వ్యక్తిత్వం లేని రాతి బొమ్మ. ఇలాంటి ఆడవాళ్ళకి స్వేచ్ఛ యిచ్చి లాభమేమిటి?

మీ నిర్వచనం— గుడ్డి మగాడికికూడా నచ్చదు. అలాంటి 'బొమ్మ లాంటి ఆడదాన్ని' కోరుకునే మగవాడిని ఏమనాలో నా కర్థం కాడం లేదు!

**ఎ. కె — కర్నూలు**

ఈ ప్రపంచంలో కొందరి జీవితాలు అనవసరంగా ఆహుతి అయిపోతాయంటే మీరు నమ్ముతారా?

ఆహుతి అయిపోతాయి— ఏ కొందరి స్వార్థాల కోసమో. అనవసరంగా ఏ జీవీ ఆహుతి కాదు.

**డి. ఏ — నాయుడుపేట**

స్త్రీ చూపులు మగవారిని కవ్వించి పిచ్చివాళ్ళను చేసేందుకేనా?

కాదు. వాలు చూపులు కవ్వించడానికి. క్రోధ దృక్కులు — అన్యాయాలని కాల్చడానికి.

**కె. వి. ఆర్ — విశాఖపట్నం**

మంచిపనికి ఫలితం ఏమిటి?

మంచి పనికి ఫలితం— అదో అలవాటుగా మారడమే! దానికి ప్రత్యక్ష నిదర్శనం మదర్ తెరిస్సా.

**ఆర్. జి ఎల్ — విశాఖపట్నం**

దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించాడంటారు. మరి మానవుని కష్టాలకు కన్నీళ్లకు కారణం ఎవరంటారు?

ఒక్క క్షణం ఆలోచిస్తే మీకే తోచేది— కంటికి కపబడని దేవుడు కాదు— యీ కన్నీళ్లకు కష్టాలకు కారణం— అని ఆ కనిపించని శక్తి యీ లోకాన్ని ఎంతో ప్రేమించక పోతే— యీ చక్కని ప్రకృతి అంతా ఎందుకు చందిస్తుండటారు? ఎవరూ కోరకుండానే గాలీ నీరూ వెలుతురూ ఎందుకందించాడంటారు?

**కె. ఎన్. ఆర్ — అక్కయిపాలెం**

మీరు సీరియస్‌గా చెప్పదల్చుకున్నది. జోక్‌గా చెప్తారు...

ముఖం చిట్లించుకుని చెప్తే ఆ మాత్రం కూడా చదువుట చిట్టి తండ్రీ అయినా సీరియస్ విషయాలు చెప్తూ, వేళాకోళంగా చర్చించినంత మాత్రాన అంతర్లీనంగా వుండే వాటి అసలు తత్వం బోధ పడదని అనుకో నక్కరలేదు. పాఠకులు మనం వూహించేటంత అమాయకులు కారు!

**కె. అర్. సి — విజయవాడ**

ఒక మగవాడు ఆడదాని దగ్గరకి విటుడిగా వెళ్లినప్పుడు డబ్బిచ్చి తృప్తిగా సుఖం కొనుక్కుంటాడు....

పొరపాటు తమరలా సెలవిస్తే యీ సంసారాలన్నీ ఏమైపోయేట్టు! అంతా మొరార్జీల్లాగా వలబై ఏళ్లనుంచీ బ్రహ్మచర్యం, ఒంటిపొద్దూ వుండలేరు! సుఖం తుచ్ఛంకాదు. దాని పట్ల మనం ప్రసరించే దృష్టిని పట్టి వుంటుంది. విలువ. కులపతి కూడా భోగేషు రంభగ వుండాలనే కదా మన వాళ్ళు చెప్పేది.. అది ఇంట లేనప్పుడే కద మగవాడు విటుడై మీరు చెప్పిన వట్టు డబ్బు లిచ్చి సుఖం కొనుక్కోవలసి రావడం..

**ఎమ్. కె. ఆర్ - చిలక (ఒరిస్సా)**

స్త్రీలోకపు ఔన్నత్యాన్ని సంపాదించడానికి మీ సమాధానాలు కొనియాడకుండా వుండలేను. కాని అవి చదివి అర్థం చేసుకో కల స్త్రీలు తనమతారు.

పొరపాటు అర్థం చేసుకుందుకు సహృదయం కావాలి ఒక్క అక్షరజ్ఞానం చాలదు!

**ఎమ్. ఎమ్. కె. జి - తాల్పేరు**

అందరూ నిన్ను తల బిరుసుగా సమాధానలిస్తున్నావంటారు. నీ యిచ్చే ఏ జవాబులో అటువంటి భయమే నాకు కనబడడం లేదు. ప్రశ్నను పట్టి జవాబుండాలి. అలాగే వుంటున్నాయి. అందుకు నాకు ఆనందంగా వుంది.

చదివేవారి దృక్పథాన్ని పట్టి చదివేది అర్థం చేసుకోవడం జరుగుతూ వుంటుంది. తమ్ముడూ, అయినా చదివే అందరినీ ఒకేలాగ మెప్పించడం సాధ్యం కాని పని. అందుకే, చెప్పదలచుకొన్నంత. సూటిగా చెప్పడమే ధ్యేయంగా రాయాలని నా నమ్మకం

**జి. ఎస్. ఎమ్ — హైదరాబాదు**

భర్త చేత అవమానాలు పడుతూ కష్టాలు భరిస్తూ సంసారం చేసిన స్త్రీ సంఘంలో గౌరవింప బడుతుంది, అంటారు. నిజమా

చచ్చి బ్రతికే స్త్రీని సంఘం గౌరవించినా ఒకటే గౌరవించకపోయినా ఒకటే! తనింటిలో తనకి గౌరవం లేనిది పై ప్రపంచంలో వుంటుందను కోవడం అత్యాశ. వినలేదా మొగుడు కొడితే మాదా నవళం వాడూ కొట్టాడన్న సామెత!

**ఎఫ్. జి — అత్తిలి**

ఆరు గజాల వస్త్రాలు ధరించేవారు గజం అరగజంలోకి దిగజారారు స్వతంత్ర్యం అధికారం యిస్తే నిలబెట్టుకోకలరనే నమ్మకం లేదు.

ఎవరికి ?! అయినా అరగజం ముక్క కూడా కట్టుకోని ఆటవిక స్థితినుంచి తొమ్మిదిమూరల చీర దాకా ఎదిగినప్పుడెప్పుడో అంది. యీ డవుటు ?! ఉప్పెనలా వచ్చిపోయే నాగరికతా ప్రభావానికీ, మనిషినుండి వేరుగాని హక్కులైన స్వేచ్ఛ స్వతంత్రాలకీ సంబంధం ఏమిటి !!

పి. ఎస్. ఎన్. జె    నాయుడుపాలెం

ఆడదాని కన్నీటి కిచ్చే విలువ మగవాడి కన్నీటికి ఇవ్వరెందుచేత ?

ఈ దేశంలో ఆడది ఏడ్చినా అందం, ఏడుపే అందం. ఏడుపు పిరికి తనానికి చేతకాని తనానికి నిదర్శనగా అలవాటు చేశారు. ఆడది ఏడుస్తే అందుకే అయ్యో ? అబల అంటూ జాలి. మగవాడు ఏడవకూడదని చిన్ననాటినుంచీ మారి పోస్తారు. నీకేం మగ మహారాజువి ! ఆడ ముండలాగా ఏడుస్తారా ! అంటూ కంట తడికీ ఆడదానికీగల అవినాభావ సంబంధ చెప్పకచెపా రు. అందుకే మగవాడు ఏడిస్తే జాలిపడరు. కాని నిజానికి కన్నీటికి కారణాలు మగా, ఆడా లేడా చూసి సృష్టింపబడవు...

# అవీ......ఇవీ......అన్నీ

## తుఫాన్ తినలేని అవినీతి

తుఫాను సహాయ కార్యక్రమాలలో కృష్ణాజిల్లాలో అవినీతికి పాల్పడిన ఒక తహసీల్దారు, ఒక బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, నలుగురు డెప్యూటి తహసీల్దార్లతోసహా కొంత మంది ఉద్యోగులను కలెక్టర్ సస్పెండు చేశారు. కైకలూరు తాలూకాలో నష్టపడని వారిపేర్లను పరిహారం చెల్లించే జాబితాలో చేర్చినందుకు కైకలూరు తాహసీల్దారును, నలుగురు డెప్యూటి తాహసీల్దారులను, అయిదుగురు రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లను, అయిదు గ్రామాల మునసబులు, కరణాలను సస్పెండు చేశారు. తుఫానుబాధితులకిచ్చిన ఆర్థిక సహాయంనుండి సొమ్మును వసూలు చేశారన్న ఆరోపణపై అవనిగడ్డ పంచాయతీసమితి బి.డి.ఒ. ను ఒక వెటర్నరీ అసిస్టెంట్‌ను సస్పెండు చేశారు. ఒక తాలూకా ఆఫీసుకు చెందినయు.డి.సి.ని సహాయ శిబిరం నుంచి మినపప్పు చేరవేసిన నేరంపై సస్పెండు చేశారు.

తిరువూరు తాలూకాలో తుఫాను బాధితులకు ఇచ్చిన సొమ్మును లంచంగా వసూలు చేశారన్న నేరంపై ముగ్గురు రెవిన్యూ ఉద్యోగులను సస్పెండు చేశారు.

గుంటూరు జిల్లాలో తుఫాను బాధితులకు సహాయాన్ని అందిస్తున్న సమయంలో అవినీతికి పాల్పడ్డారన్న ఆరోపణపై నల్లపాడు బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ని, సమితి వ్యవసాయ శాఖ సహాయాధికార్ని, మునసబుని, గుంటూరు తాలూకా గణాంకశాఖ సహాయకుని, విశదల గ్రామ మునసబుని, ల్యామ్ గ్రామ మునసబుని, వెలిగళ్ల మునసబుని,కరణాన్ని, గణపవరం గ్రామ మునసబుని జిల్లా కలెక్టర్ సస్పెండు చేశారు.



ఇటీవలి తుఫాన్‌లో యిళ్ళు కోల్పోయిన తీర గ్రామవాసులకు 5 వేల రూపాయిలతో కాంక్రీటు టాపువున్న గట్టి యిండ్లను కట్టి యివ్వటానికి వీలుగా విజయవాడలోని యిద్దరు యువయింజనీరింగు ఆర్కిటెక్టులు జి. వివేకానందస్వామి, పి. దీనదయాళ్ బాబులు పై గృహ నమూనాని తయారు చేశారు. దీనికి 180 చ. అ. జాగా చాలు – 72 సిమెంట్ బస్తాలతో పేదలకు ఆధునిక స్నానాల గదిసహా చిన్న యిల్లును కట్టవచ్చునని స్వచ్ఛంద సంస్థలవారికి సూచిస్తూ విజయవాడలో పత్రికా విలేఖరుల గోష్ఠిలో వీరు వివరించారు.

## 'మగదిక్కు' ఆవిష్కరణం

శ్రీ పైడిపాడి సుబ్బరామశాస్త్రి రచించి, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రకటింపబడిన మగదిక్కు నవల 11-12-77న శ్రీ పాటిబండ సుందర రావుగారి అధ్యక్షతను శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లుగారు ఆవిష్కరించారు

శ్రీయుతులు తూములూరి లక్ష్మీనారాయణ, కురుమద్దాలి విజయలక్ష్మి, శిష్ట్లా ఆంజనేయశాస్త్రి ప్రసంగించారు. విజయవాడ దివ్యజ్ఞాన సమాజమందిరంలో విజ్ఞానసమితి ఆధ్వర్యంలో సభ జరిగింది. రచయిత సత్కరింపబడినారు.

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకితమివ్వబడిన ఈ నవల ముఖచిత్ర రచన శ్రీ బాలి చేశారు. గెటప్,ముద్రణ చాలా చక్కగా వుంది. పేజీలు: 328, వెల: పదిరూపాయలు, ప్రతులకు: రచయిత, భారతి నికేతన్, సుబ్బరామశాస్త్రి వీధి, విజయవాడ– 520 004.

ఈ విపత్కర పరిస్థితినుంచి బయటపడాలంటే, సెన్సారు వారినిర్లిప్త వైఖరిని ఖండించాలి. ప్రేక్షకుల బలహీనతలను ఆధారంగా చేసుకుని ధనార్జన లక్ష్యంగా పెట్టుకున్న దర్శక, నిర్మాతలకు, నటీనటులకు. రచయితలకు సవ్యమైన మార్గమేదో తెలియచెప్పాలి. మల్లీశ్వరి, మాలపిల్ల, దేవదాసు వంటి ఉత్తమచిత్రలకు గతిలేదు సరికదా, 10, 15 సంవత్సరాల క్రింద మనం చూడగలిగిన నీట్ అయిన

## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

కుటుంబ గాధాచిత్రాలు కూడా పేడు కరువు అవుతున్నాయి. ప్రేక్షకుల మనస్తత్వంలో కూడా పరివర్తన కలిగితే తప్ప, ఈ విషవలయానికి విచ్ఛిత్తి లేదు

మురారి శ్రీ,
గౌరవాధ్యక్షుడు, క్లాసికల్ ఫిలింసొసైటీ, తెనాలి.]

### అట్టమీద బొమ్మ

ఎన్నిరోజుల తరువాత మా అభిమాన నటుడు శ్రీ కృష్ణంరాజు గారి ముఖచిత్రం (21.11.77) సంచిక వేసినందుకు మీకు వేనవేల కృతజ్ఞతలు.

వారిజ, [కొవ్వూరు.]

* * *

హిందుటి ప్రీతిసప్రూ ముఖచిత్రంతో వెలువడిన నా అభిమాన పత్రికలో కథలన్నీ చాలా బాగున్నాయి. కార్టూన్సు ఎక్కువగా వేయవలసిందిగా కోరుతున్నాను.

పి. వి. రామనాథరావు, [మధిర.]

### సీరియల్

మీరు ప్రచురిస్తున్న జీవనపోరాటంలో ఆశల ఆరాటం కథ చాల బాగుంది. వాస్తవానికి దగ్గరగా వుంది. రచించిన పి. వి. ఆర్. శివకుమార్ గారికి ప్రచురిస్తున్న మీకు మా అభినందనలు.

సి. హెచ్. గంగాలక్ష్మి, (రామచంద్రపురం)

* * *

జీవనపోరాటంలో ఆశలఆరాటం , రాగబంధం సీరియల్స్ ఒకదాని కొకటి పోటీపడుచున్నవా అని అనిపించుచున్నవి. ఇకముందు కూడా ఇటువంటివే మంచి ఇంటరెస్టింగ్ సీరియల్స్‌ని ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

సందిగామ మణిమోహన్‌కృష్ణ, [హైదరాబాద్.]




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# పరిపూర్ణ విజయం





# వైశాక్ 3 జాతీయ బహుమతులు







అఖండవిజయం... సుగంధపుష్పగుచ్ఛ పరంపర.. విశిష్ట పరిమళ భరితమైన అగరుబత్తికి ప్రత్యేక బహుమతిత్రయం. అందచందాలు నిండిన అట్ట పెట్టికుగాను, **1977లో**, వైశాక్ **3** జాతీయ బహుమతులను పొందింది. అట్టపెట్టెలపై గల చిత్రీకరణ కేమి అద్భుతంగా అచ్చువేసి నందు కేమి దేశంలో ఈ బహుమతులు అగ్రశ్రేణివి! ఇవి కేంద్ర ప్రచార మంత్రిత్వశాఖవా రిచ్చే బహుమతులు.

ెశాక్ ఉత్తమోత్తమమైన దనడానికి ఇది మరొక నిదర్శనం. ంతర్జాతీయ మన్ననలను పొందిన ఒక విశిష్ట వస్తువుకు ేయు గౌరవ ప్రధానం.




**ఓనమ్ అగరుబత్తి కంపెని**

156, 3 వ మెయిన్ రోడ్, చామరాజ్ పేట
బెంగుళూరు-560 018

CAS-OAC-7790